ప్రచురణ—4.

# భాషాశాస్త్ర మూలసూత్రాలు

★


రచయిత

కొత్తపల్లి రంగారావు

విద్యాప్రవీణ, భాషాప్రవీణ


★


అరుణోదయ ప్రచురణలు

ప్రచురణ—4

# భాషా శాస్త్ర మూల సూత్రాలు


ర చ యి త

## కొత్తపల్లి రంగారావు

విద్యాప్రవీణ, భాషాప్రవీణ





అరుణోదయ ప్రచురణలు

వెల
రూ. 0-12-0

తొలికూర్పు : వెయ్యి ప్రతులు
ముద్రణ : లక్ష్మీ ఆర్టు ప్రింటర్సు, గుంటూరు
ప్రచురణ : జనవరి 1955

ప్రతులకు
అరుణోదయ ప్రచురణాలయము
అమృతలూరు పోష్టు, గుంటూరు జిల్లా

★

# అంకితం



విశాలాంధ్రలో ప్రజారాజ్య స్థాపనకై
వీరోచితంగా పోరాడే
విప్లవ యోధులకు

★

# విషయ సూచిక



# భాషలు

నేడు ప్రపంచంలో భాషలు సుమారు మూడువేల (3000)కు పైగా ఉన్నాయి. ఇందులో అధిక సంఖ్యాకులు మాటాడుతుండే పదమూడు పెద్దభాషల్లో అగ్రస్థానం చైనా (హాన్ – హూణ?) భాషది (55). దాదాపు ప్రపంచమంతటా వ్యాప్తమై చైనాభాషతరువాత ఎక్కువమంది మాటాడేభాష ఇంగ్లీషు (25). అటుపిమ్మట హిందీ – ఉర్దూ (20) స్పానిష్ (14) రష్యన్ (12) జర్మన్ (8) జాపనీస్(8) ఫ్రెంచి (7) బెంగాలీ (6) వగైరా భాషలు వరుసగా అధిక సంఖ్యాక ప్రజలచే భాషించ బడుతున్నాయి.

## భాషా కుటుంబాలు

ఈ వివిధభాషలను కొంతవఱకు పరిశీలించిన భాషా శాస్త్రజ్ఞులు ప్రకృతి-ప్రత్యయ సామ్యమునుబట్టి, తదితర వ్యాక రణ సామ్యాన్నిబట్టి వీటిని (1) ఆర్య (ఇండో-యూరపియన్) (2) సెమిటిక్ (3) హామిటిక్ (4) తురేనియన్ (ఊరల్-ఆల్టై యిక్) లనే నాలుగు కుటుంబాలుగా విభజించి యున్నారు.

I <u>ఆర్య (ఇండో-యూరపియన్) భాషలు</u> : 'సెటమ్' భాష లనీ, 'కెంటుమ్' భాషలనీ రెండురకాలుగా వ్యవహరించ బడుతున్నాయి.

'సెటమ్' భాషలు — i ఆర్యన్, ii ఆర్మీనియన్ iii బాల్టో స్లవోనిక్, iv ఆల్బేనియన్ భాషలు.

'కెంటుమ్' భాషలు- i ట్యూటనిక్ (జర్మానిక్), ii కెల్టిక్, iii గ్రీక్ iv లాటిన్ భాషలు.

పై ఎనిమిది శాఖలు (stocks) ను శాఖోపశాఖలు (branches)గా చీలి. ఈ క్రిందివిధంగా అనేకాధునిక ఆసియా ఐరోపా భాషలకు మూలములైనవి.

ఆర్యశాఖ:- i భారతీయ వైదిక వ్యావహారికభాషలు, ii ఐరేనియన్ అవెస్తా భాషలుగా చీలింది.

భారతీయ వైదిక భాషనుంచి, ఆనాటి వ్యావహారిక భాషలనుంచి క్రమేణ సంస్కృత ప్రాకృత భాషలునూ, అవి అనేక మార్పులు జరిగినమీదట 1 హిందీ, 2 బెంగాలీ, 3 పంజాబీ, 4 మరాఠీ, 5 గుజరాతీ, 6 సింధీ, 7 ఒరియా, 8 అస్సామీస్ మొ॥ ఆధునిక ఉత్తర హిందూస్థాన భాషలుగానూ పరిణమించాయి.

ఐరేనియన్ భాషనుంచి ఆధునిక పర్షియన్, ఆఫ్ఘన్, తాజిక్, ఉజ్బెక్, బెలూచీ మొ॥ మధ్య ఏషియా భాషలు ప్రాదుర్భవించాయి.

బాల్టో-స్లావానిక్ శాఖ:- ఇది ముఖ్యంగా తూర్పుయూరపుకు సంబంధించినది. 1 రష్యా, 2 లిథుయేనియా, 3 పోలెండు, 4 సెర్వియా, 5 బల్గేరియాలలోని భాషలునూ, 6 హంగరీ, 7 బొహీమియాలలోని కొన్ని భాగాలలో మాటాడే భాషలును ఈ తెగలో చేరుతాయి.

ట్యూటనిక్ శాఖ:- i స్కాండినేవియన్ ii గోథిక్ భాషలుగా చీలింది.

i] స్కాండినేవియన్ భాషలు: 1 ఐస్లాండిక్ 2 స్వీడిష్ 3 నార్వేజియన్ 4 డేనిష్.

ii] గోథిక్ భాషలు :- 1 జర్మన్ 2 ఫ్రిజియన్ 3 డచ్ 4 ఫ్లెమిష్ 5 శాక్సన్ 6 ఇంగ్లీషు.

<u>కెల్టిక్ శాఖ</u> :- i గాలిక్ ii కైమ్రిక్ లేక కేంబ్రియన్.

i గాలిక్ భాషలు :- 1 ఐరిష్ 2 హైలాండ్ స్కాచ్ 3 మాంక్సు (మాన్ ద్వీపభాష)

ii కైమ్రిక్ భాషలు :- 1 వెల్షు 2 కోర్నిష్ 3 బ్రెటన్.

లాటిన్ శాఖ :- 1 ఇటాలియన్ 2 ఫ్రెంచి 3 స్పానిష్ 4 పోర్చుగీస్.- వీటిని రోమన్సు లేక రోమనిక్ భాష లంటారు.

<u>II సెమిటిక్ భాషలు</u>: 1 హీబ్రూ 2 చాల్డెక్ 3 ఫోనిషియన్ 4 సిరియాక్ 5 అరబిక్ 6 మాల్టీస్ 7 ఎథియోపిక్ మొదలయినవి.

<u>III హామిటిక్ భాషలు</u>: 1 ప్రాచీన ఈజిప్షియన్ 2 కోప్టిక్ భాషలు.

<u>IV తురేనియన్ (యూరల్-ఆల్టెయిక్) భాషలు</u>: i సిథియన్ ii ద్రవిడియన్ iii మలెయిక్ లేక మలె-పాలినీషియన్ లేక ఓషనిక్ iv దగ్గిక్ v ముండా మొ॥వర్గాల భాషలు.

i సిథియన్ వర్గం: 1 ఫిన్నిష్ 2 లాప్పిష్ 3 హంగేరియన్ 4 టర్కిష్ 5 మంగోలియన్ 6 మంచూ,

ii ద్రవిడియన్ వర్గం: 1 తెలుగు 2 కన్నడం 3 తమిళం 4 మళయాళం 5 తుళు 6 కొడగు 7 తోద 8 కోత 9 కురుఖు 10 మల్తో 11 గోంది 12 కుఇ 13 కోలామీ 14 బ్రాహుఈ 15 జావనీస్ 16 కొరియన్ మొ॥ ఈశాన్యాసియా భాషలు.

iii ఓషనిక్ వర్గం: 1 మలాకా 2 ఇండోచైనా 3 ఇండోనీషియా 4 ఆస్ట్రేలియా 5 దక్షిణాఫ్రికా 6 చైనా 7 సయాం 8 బర్మా 9 టిబెట్ 10 దక్షిణ-అమెరికాల లోని భాషలు 11 స్పెయిన్-ఫ్రాన్సుల్లోని బాస్క్ భాష మొ॥. ఈదేశాల్లోని ఆదిమ నివాసులను,మధ్యభారతం, బెంగాల్ మొ॥చోట్లఉన్న ఇండియాలోని ఆదిమనివాసుల (ముండాలు, నాగులు, సంతాలుల)ను మంఖ్మేర్ తెగలని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఈ తెగలకు, వీరి భాషలకు గల పారస్పరిక సంబంధాలనుగూర్చి ఇతోధిక పరిశోధన అవసరం. చైనాలో ప్రధానంగా ఒక్క చైనా (హాన్) భాషనే సుమారు 55 కోట్ల ప్రజలు మాట్లాడుతున్నారు. హాన్ జాతికాక చైనాలో ఇంకో పది ఇతర అల్పసంఖ్యాక జాతులున్నాయి.

iv దర్దిక్ వర్గం: 1 బ్రాహుఈ 2 పష్తై 3 షీనా

v ముండావర్గం: సవరభాష మొ॥.

ఆర్యభాషలు (ఇ.యు.భా.) ప్రపంచ భాషలన్నింటిలోకి బాగా అభివృద్ధి (ఉత్తమశ్రేణికి) చెందినవి. పరిపక్వతకు, వైవిధ్యానికీ, పదసంపదకూ, సారస్వత విస్తృతికి పేరొందినవి.

ప్రపంచ జనాభాలో దాదాపు సగంమంది యీ భాషలు మాట్లాడేవారే. ఇవి ప్రపంచమంతటా అనేక ప్రాంతాల్లో బహుళ వ్యాప్తిగాంచినవి. ఇందుకు ఆర్థిక రాజకీయ భౌగోళిక చారిత్రకాది కారణాలెన్నో వివిధ చారిత్రక దశల్లోనూ, యుగాల్లోనూ పనిచేశాయి. తత్ఫలితంగా ద్రావిడభాషల్లాంటి తదితర భాషాకుటుంబాలమీద కూడా యీ కుటుంబానికి సంబంధించిన భాషలప్రభావం హెచ్చుగావడింది. అటుపిమ్మట సెమిటిక్ భాషలు వస్తాయి. చైనా భాషకూడా అతి ప్రాచీనమైనది. అందులోఅతిప్రాచీనమూ అత్యంతవిపులమూ అయిన సారస్వతం ఉంది. భారతీయ భాషాసంస్కృతుల ప్రభావం ఇందులో సువ్యక్తమవుతోంది.

పై భాషాకుటుంబాలలో ఇండో-యూరపియన్ భాషా కుటుంబంలో మాత్రమే తగినంత పరిశోధన జరిగింది. పాశ్చాత్య పండితులు అందులోనూ గ్రీక్, రోమన్, ట్యూటనిక్, ఆర్య శాఖలందు మాత్రమే విశేషకృషి గావించారు. స్లావ్ శాఖలో గానీ, మధ్యఏషియా భాషల్లోగానీ వారు తగినంత పరిశోధన చేయలేదు. అంచేత చాలామంది పాశ్చాత్య భాషాశాస్త్రవేత్తలు ఆర్య, సెమిటిక్ కుటుంబాలుగాక మిగతాప్రపంచ భాషలన్నింటినీ 'తురేనియన్' కుటుంబంలో చేర్చివేశారు.

ఈవిధంగా వివిధవర్గాలను 'తురేనియన్' కుటుంబంగా పేర్కొనడం కొంతమంది భాషాశాస్త్రజ్ఞులకు ఇష్టంలేదు. అందుచేత వీరీవర్గాలను వేరువేరు కుటుంబాలుగా పేర్కొన్నారు. 'కీలే' చెప్పినట్లు ఈభాషలన్నీ స్పష్టప్రత్యయ (Aggluti-

native) భాషలు కావడంలోనూ, వీటిని మాటాడే వివిధ తెగల్లో జాతులుగా పరిణమించిన చైనా, ద్రావిడాది తెగలు తప్ప మిగతావి చాలవరకు నేటికీ సంచార తెగలై, ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక నిర్మాణాన్ని, భాషాలిపి సారస్వత నిర్మాణాన్ని తీర్చి దిద్దుకోక పోవడంలోనూ, పడ వాక్యాది భాషానిర్మాణంలోనూ దప్ప ఒకే కుటుంబానికి చెందినవని చెప్పడానికి వీల్లేనంతగా పరస్పర విభిన్నాలుగా యిందలి వివిధవర్గాలు కన్పిస్తున్నాయి. అయినా, ఇంకా ఎంతో పరిశోధన చేసిచూడడం అవసరం.

రష్యన్ భాషాతత్వవేత్తలు తమభాషలనుగురించి చేసిన అమూల్యకృషిమన కిటీవలివరకు లభించలేదు. అలాగే ఆధునిక చైనా పండితుల భాషాకృషి సయితం ఇంతవరకు పూర్తిగా లభించలేదనే చెప్పాలి.

## ఒకే మూలభాషా?

ప్రపంచ మూలభాషలన్నీ ఒకే మూల భాషనుంచి ఉత్పన్నమయ్యాయనే కొందరి భావనను-అందుకు తగిన ఆధారాలు ఇంకా పూర్తిగా లభించక పోవడంవల్ల భాషాశాస్త్రజ్ఞులు ఇంతవరకు ఇదమిత్థమని తేల్చలేకున్నారు.

మానవజాతి మొదట ప్రపంచంలో ఒకేచోట పుట్టిందనీ, అక్కడినుంచి నలువైపులకు విస్తరించిందనేవాదం ఋజువై పూర్తిగా యథార్థమయితే, భాషలుకూడా ఒకే మూలభాష నుంచి ఉద్భవించాయనేది కొంతవరకు ఒప్పుకోవచ్చు. మొట్ట మొదట మానవజాతి ఇరాన్-పామీర్ సీఠభూముల మీద

పుట్టిందని పౌరాణికగాథలు తెల్పుతున్నాయి. అందుకు కొన్ని నిదర్శనాలుకూడా లభిస్తున్నాయి. పైని పేర్కొన్న నాలుగు భాషా కుటుంబాలకు సంబంధించిన వివిధ తెగలు మొదట్లో దాదాపు ఈ పరిసరాలనుంచే ప్రపంచమంతటా విస్తరించాయని తెలిసినంతవరకు మానవజాతి చరిత్ర చెపుతోంది. నేటి మధ్య ఏషియా భాషల్ని పరిశీలిస్తే, అవి ఐరేనియన్, తురేనియన్, సెమిటిక్ భాషల సమ్మేళన ఫలితాలని తెలుస్తోంది. కాని, ఇప్పటికి త్రవ్వి తెలుసుకొన్నంతవరకు ప్రాచీనమానవుల పుర్రెలు, ఎముకలు, కంకాళాలు చైనా, జావా, ఆఫ్రికా, యూరప్ మొ॥ చోట్ల దొరికాయి.

ఆధునిక మానవజాతి శాస్త్రజ్ఞులు మానవుల్ని వారి ముఖ్యావయవ నిర్మాణాన్ని బట్టి ఏడు రకాలుగా విభజిస్తున్నారు. 1] ఆర్యజాతి (100-110) 2] మంగోలుజాతి (76) 3] ఆస్ట్రిలాయిడులు (16) 4] నీగ్రోజాతి (12) 5] సెమిటికులు (12) 6] మలయనులు (11) 7] ద్రావిడులు (10)

మన ప్రాచీనులు ఈక్రిందివిధంగా వివిధ ఆదిమ తెగలను దేవయోనులు (సహజ జాతులు) గా పేర్కొన్నారు—

"విద్యాధరోఽప్సరో యక్ష రక్షో గంధర్వ కిన్నరాః।
పిశాచో గుహ్యక స్సిద్ధో భూతోఽమీ దేవయోనయః"

1) విద్యాధరులు=ఆర్యులు? 2) అప్సరసలు=అవగ దేశ స్థులు-(అఫ్ఘన్లు) తుషారజాతులు? 3) యక్షులు='యఛీ' లు= జక్కులు(czechs?) ఆక్సస్ లేక జక్సార్టిస్ నదీతీరపు(పచ్చని) మంగోలులలో ఒక తెగవారు-మన జాతికి మూల తెగల్లోఒకటి.

4) రక్షస్సులు=రాక్షసులు,కిర్ఘిజులు(అసురులు=అస్సీరియనులు) 5) గంధర్వులు = గాంధారులు = కాందహార్ ప్రాంతపువారు 6) కిన్నరులు=చిన్న(పొట్టి) మనుషులు - ఇప్పటికీ హిమాలయ ప్రాంతాల్లో నివసించే కొన్ని వామన ఆదివాసి తెగలు 7) పిశాచులు=పైశాచీభాష మాట్లాడే దర్దిక్ మొదలగు తెగలవారు 8) గుహ్యాకులు - ఘుర్ఖాలు? (కింపురుషులు - నేపాలువారు) 9 సిద్ధులు—సిథియనులు 10 భూతాలు—భూటాన్ ప్రాంతీయులు.

## భాషా శాస్త్రం

భాషాశాస్త్రమనగా భాషలను గురించిన శాస్త్రం. ఒక భాషయొక్క పరిణామాన్ని, దాని స్వరూప స్వభావాలను, దాని చరిత్రను సరిగా చూపించేదే భాషాశాస్త్రం.

[i] వర్ణనాత్మక వ్యాకరణం (డిస్క్రిప్టివ్ గ్రామర్) [ii] సాదృశ్యాత్మక వ్యాకరణం (కంపారిటివ్ గ్రామర్) [iii] చారిత్రిక వ్యాకరణం (హిస్టారికల్ గ్రామర్) అని వ్యాకరణం మూడు రకాలుగా ఉంటుంది. భాషాశాస్త్రమనగా యీ మూడు రకాల లక్షణాలు గలిగిన పరిపూర్ణమైన వ్యాకరణ మన్నమాట. పై వాటిలో ఏ ఒక్క-దానిలో మాత్రమే కూడు కొన్నా అది అసమగ్రమే అవుతుంది.

ముఖ్యంగా భాషయొక్క చారిత్రక పరిణామాన్ని స్పష్టీకరించేది భాషాశాస్త్రం.

భాషాశాస్త్రం ముఖ్యంగా 17వ శతాబ్దంనుంచి ఒక ప్రత్యేకశాస్త్రంగా అభివృద్ధి గాంచింది. ఐరోపా పండితులు ఆసియా జాతుల తోటీ, వారి భాషల తోటీ, ముఖ్యంగా

సంస్కృత భాషతోటీ, తదితర భారతీయ భాషలతోటీ సంబంధ మేర్పరచుకొని, ఆయాభాషలను తరచి చూచినఫలితంగా ఈ భాషాశాస్త్రి మూలసూత్రాలను కనుగొనడం సాధ్యమయింది.

సంస్కృత భాషాపరిచయం కలుగకముందు పాశ్చాత్య పండితులు తమ భాషలన్నీ గ్రీకు ల్యాటిన్ భాషలనుంచీ పుట్టాయనీ, అవి హీబ్రూ(బైబిల్ భాష) నుంచి జనించాయనీ సిద్ధాంతీకరిస్తూ ఉండేవాళ్లు. ఏమంత సంబంధంలేక పోయినా ఏదో విధంగా హీబ్రూభాషతో ముడిపెట్టుకొంటూ ఉండేవాళ్లు. ఇక సంస్కృతభాషను అధ్యయనం చేసిన పిమ్మట మొదట్లో అవి సంస్కృతంనుంచి ఉత్పన్నమైనవనీ, ఇంకా నిశితంగా పరిశీలించిన మీదట తమ భాషలు సంస్కృతభాషా కలిసి ఒక మూలభాష నుంచి జనించినవనీ గ్రహించి భాషాశాస్త్రి రచనకు పూనుకొన్నారు. ముఖ్యంగా హెర్డర్, బాప్, గ్రిమ్, రాస్క్, మాక్స్ ముల్లర్ మొదలయిన జర్మన్ పండితులీ విషయంలో ఎక్కువ కృషిసల్పారు. సుదీర్ఘకాలంనుంచి తమ్ము వేధిస్తున్న భాషా సమస్యను పరిష్కరించడానికి మూల కారణమైన సంస్కృత భాషను వేనోళ్ళ ఉగ్గడించారు. సర్ విలియమ్ జోన్స్ అనే భాషాశాస్త్రివేత్త భాషాశాస్త్రిమున సంస్కృతము ప్రాధాన్యమును గూర్చి యీక్రింది విధంగా ప్రస్తుతించారు.

“ సంస్కృత భాషాప్రాచీనత విషయమై భేదాభిప్రాయాలుండ వచ్చును. కాని, దాని నిర్మాణ మద్భుతమైనది. అది గ్రీకు భాషకంటె సంపూర్ణమైనది. ల్యాటిన్‌కంటె శబ్ద

సంపద యందు విశాలమైనది. గ్రీక్, ల్యాటిన్ భాషలు రెంటి కంటె ఎక్కువ సంస్కారము నొందినది. దానికిని, ఈ రెండు భాషలకును క్రియాధాతువుల విషయమునను, వ్యాకరణ రూప ముల విషయమునను దగ్గఱసంబంధము గలదు. ఈసంబంధం యాదృచ్ఛికంకాదు. భాషాశాస్త్రజ్ఞుడీ మూడుభాషలను సరి పోల్చునపుడవి యన్నీ ఏకమాతృకనుంచి ఉత్పన్నము లైనవని తలచకుండా ఉండడు. ఆమాతృక నేడు లేకపోవచ్చు. ఇక్లే గాథిక్, కెల్టిక్ భాషలుకూడా సంస్కృతంతో సాజాత్యం కల్గిన వని ఊహించుకోవచ్చు. ప్రాచీన పెర్షియన్ భాష కూడా ఈ కుటుంబానికి చేరినదనే చెప్పవచ్చు.''

'' సంస్కృతభాషా పరిచయంలేని భాషాశాస్త్రజ్ఞుడు గణితశాస్త్రము తెలియని జ్యోతిష్కుని వంటివాడ''ని మాక్సు ముల్లర్ ఉద్ఘోషించాడు.

అంతేగాక, అనేక విషయాల్లో సంస్కృతం మూల భాషకు దగ్గఱగా ఉంటుందని చెప్పవచ్చు.

## భాషా బోధనలో భాషాశాస్త్ర పద్ధతి

భాషాబోధనలో ఇటీవల నవీన పద్ధతులు చాలా వచ్చాయి. భాషాశాస్త్రపద్ధతి ఒక ప్రత్యేక భాషాబోధనా పద్ధతిగా యింతవరకు గుర్తించబడకపోయినా, దీని నొక ప్రత్యేక పద్ధతిగా గుర్తించి, ఆధునిక పద్ధతుల్లో ఒకటిగా ప్రవేశపెట్టి దీనికి తగిన ప్రాముఖ్యత యివ్వవలసి వున్నది. భవిష్యత్తులో

దీని ప్రాముఖ్యత మరీ హెచ్చుతుంది. ఈ పద్ధతిని గురించి యిక్కడ కొంత వివరిస్తాను.

కాలక్రమేణ వివిధ తెగలు, జాతులు సమ్మిళితములై వేరువేరు ప్రాంతాల్లో వేరువేరు జాతులుగా మారియుండడం వల్ల, మారుతూ ఉండడంవల్ల ఆ తెగలు, జాతులతో బాటు వాటి భాషలుకూడా కొంతవరకు మారడం సహజం. మూల పదాలు, వ్యాకరణ వ్యవస్థలోమాత్రం అవసరమైతేతప్ప అంత త్వరగా పెద్ద మార్పులేవీ రావు. అందుచేత భాషాశాస్త్రం ఒక భాషలోని వివిధ చారిత్రావస్థలను ప్రతిపాదించడంవల్ల అది చరిత్రాత్మక శాస్త్ర మవుతుంది.

## భాషాశాస్త్ర ప్రయోజనాలు

ఒక భాషకు సంబంధించిన ఒక ప్రత్యేకావస్థను వర్ణించే వర్ణనాత్మక వ్యాకరణంకంటె అందలి సర్వావస్థల పరిణామ క్రమాన్ని నిరూపించే చారిత్రక వ్యాకరణం, దానికంటే సజాతీయ భాషాసాధర్మ్య వైధర్మ్య ప్రదర్శకమైన సాదృశ్యాత్మక వ్యాకరణం భాషాతత్త్వబోధనలో ఎక్కువ ప్రయోజనకారి అవుతుంది. భాషాశాస్త్రంలో ఈ త్రివిధమైన వ్యాకరణం అంతర్గర్భిత మవడంవల్ల ఏ ఒక భాష తత్వాన్ని తెలుసుకోవా లన్నా ఆ భాషకాలూకు భాషాశాస్త్రాన్ని అధ్యయనం చేయ వలసి వుంటుంది. అంతేకాదు. తెలుగులాంటి ద్రావిడభాషా కుటుంబానికి సంబంధించిన భాషను సరిగా అర్థం చేసుకోవా లంటే అది ఎక్కువభాగం తత్సమ, తద్భవపదజాలంతో నిండినం దున, ఆర్యభాషాచరిత్రను గూడా శ్రద్ధతో అధ్యయనం చేయ

వలసివుంటుంది. అందులోకూడా ఇండో-యూరపియన్ భాషల్లో బహుళవ్యాప్తి (ప్రచారం) గల ఇంగ్లీషు, హిందూస్తానీ, రష్యన్ మొదలయిన భాషల్లోని పదజాలంతో మన తత్సమ తద్భవ పదజాలాన్ని పోల్చుకొని చూచుకోవడం అత్యంత ప్రయోజనకారి అవుతుంది.

కనుకనే, నేడు ఈ భాషాశాస్త్ర మూల సూత్రాలను గ్రహించడంవల్ల పాఠకులకు ముఖ్యంగా ఈ దిగువ ప్రయోజనాలు కలుగగలవు.

1. మానవ సమాజ చరిత్రను సమగ్రంగా అర్థం చేసుకోవచ్చు.
2. వివిధజాతుల సంబంధాల చరిత్రను అవగాహన చేసుకోవచ్చు.
3. భాషాభివృద్ధి సూత్రాలు గుర్తించవచ్చు.
4. ఆయాభాషల మూలపదాల ప్రకృతి-వికృతుల, ప్రాతిపదిక-ప్రత్యయాల వాక్యనిర్మాణాది వివిధ వ్యాకరణాంశాల శాస్త్రీయ చారిత్రక విజ్ఞానం సంపాదించవచ్చు.
5. వివిధ జాతుల సామరస్యానికి, అంతర్జాతీయతాభివృద్ధికి దోహదమవుతుంది.
6. భాషల విషయంలో చారిత్రకదృష్టి ఏర్పడుతుంది.
7. విద్యార్థులు, పరిశోధకులు సాదృశ్యాత్మకంగా వ్యాకరణాన్ని అభ్యసించడానికి వివిధ భాషలను త్వరితంగా నేర్చుకోడానికి వీలు అవుతుంది.

# వివిధగణాల తెగల భాషల సమ్మేళనం

అంతేకాదు. ప్రపంచంలోని వివిధదేశాలు, వేరువేరు తెగలు, విభిన్నజాతులూ అనేక శతాబ్దాల నుంచి సహస్రాబ్దాలనుంచి పరస్పరం ఆర్థిక రాజకీయ సాంఘిక సాంస్కృతికాది బహువిధసంబంధాలు కలిగి ఉన్నాయి. బానిసత్వ, అర్ధబానిసత్వాలద్వారా వ్యవసాయం, వివిధవృత్తులు, పరిశ్రమలు మొ॥ ఉత్పత్తి కార్యక్రమం కొనసాగించడం, వలసపోవడం, వ్యాపారాలు చేయడం, దండయాత్రలు చేయడం, రాజ్యాలు, అధినివేశాలు సామ్రాజ్యాలు స్థాపించడం, వివిధగణాలు, తెగలు, జాతులు పరస్పరం సాంకర్యం నెఱపడం, మత సాంస్కృతిక ప్రచారాలు సల్పడం ఇలాంటివే. ఈ సంబంధాల హెచ్చుతగ్గులను బట్టి ఆయాగణాల, తెగల, జాతుల భాషలు ఎన్నోరకాల పరిణామాలకు, పారస్పరిక ప్రభావాలకు గురి అయ్యాయి. నేడు ప్రతిభాష ఈ చారిత్రక సాంఘిక సంబంధాలవల్ల తదితర ప్రాంతీయ, దేశీయ, విదేశీయ భాషలతో పలుమారులు, పలురకాలుగా సంకీర్ణమై వున్నది. ఒకేభాషలోని అత్యవసరమైన పదజాలంలోనూ, వ్యాకరణ రీతుల్లోనూ వైవిధ్యం, వైచిత్ర్యం కాన్పించడానికి ఇదే కారణమై వుంటుంది. అందుచేతనే వివిధభాషలూ వేరువేరు చారిత్రక పరిణామ దశలలో కన్పిస్తున్నాయి. ఉదాహరణకు మన తెలుగుభాషను తీసుకొని పరిశీలించే సందర్భంలో ఈ దిగువ చరిత్రాంశాలను విచారించవలసి ఉంటుంది.

1. ఆర్యులకంటె ద్రావిడులు (తెలుంగులు) కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే మధ్యఆసియానుంచి మనదేశం వచ్చి నట్లు ఇప్పటికీ మనదేశమంతటా అక్కడక్కడా దిగబడిన ఆది వాసి ద్రావిడ తెగలు, వారిభాషలు, ఆచార వ్యవహారాలు సంప్రదాయాలు, జాతీయాలు, సామెతలు, జానపద గాథలూ, శాఖాగోత్ర నామాలు వగైరా సామ్యాల్నిబట్టి నిర్ణయించు కోవచ్చు. ఆర్యులు తమలో లీనం చేసుకొన్నవారిని విడిచి పెట్టినా, దేశంమొత్తంమీద సగానికిపైగా అనార్య, ద్రావిడ (అసుర) సంతతివారేనని చెప్పవచ్చు. దాక్షిణాత్యులలో చాల భాగం, దేశవ్యాపితంగాఉన్న హరిజనులు, వెడ్యూల్డు తరగతి వారు, ఆదివాసులైన అడవి కొండజాతులవారు, శూద్రులు మొ॥వారిందులో చేరతారు. మొత్తంమీద ఇన్నివేలేండ్లుగా సాగిన చరిత్రలో కొంతవరకైనా సాంకర్యానికి గురిగాని వర్ణం, గణం, తెగ, కులం, తరగతి ఉండదనే చెప్పవచ్చు. 'మను స్మృతి' మొ॥ వాటిలో పేర్కొనబడిన వివిధ అనులోమ విలోమ జాతులూ, వారికి నిర్ణయించబడిన వివిధ వృత్తులు యీ విషయాన్నే ఋజువుచేస్తున్నాయి. అంతేకాదు. నేటికీ మనలో ఆర్య, ద్రావిడ, మంగోలు, సెమిటిక్, నీగ్రో వగైరాజాతుల ముఖాలు ఆయారంగులతోనూ, ఆకారవిశేషాలతోనూ తొంగి చూస్తూనే ఉన్నాయి. ముఖ్యమైన జాతులన్నిట్లో యీ అంత ర్జాతీయ లక్షణాలు ప్రస్ఫుటమవుతూనే ఉన్నాయి.

2. మంగోలు తెగలు ఆసియా అంతటా, తూర్పు యూరపులోనూ, అమెరికాలోనూ గూడా వ్యాపించాయనేం

దుకు ఆధారాలు కన్పిస్తున్నాయి. యక్షులు మంగోలు తెగల వారే అనేది చాలామంది ఒప్పుకుంటున్నారు. వారు తమన్ని దేవ సంతతిగా భావించుకొనేవారు.

3. తురుష్కలు (తురకలు) కొందరు మధ్య ఆసియా లోని తుర్కీస్థాన్ ప్రాంతంనుంచి పడమటి ఆసియాకు - నేటి టర్కీ ప్రాంతానికి, తూర్పు యూరపుకు, తూర్పు ఆసియాకు కూడా వలసవెళ్లారు. భారతదేశానికి కొందరు వచ్చారు. ట్యూరేనియనులు, తెలుంగులు, తురుష్కలు, తార్తారులు, తుర్వస సంతతి = తుఘ్రజాతి = తుషారజాతి అంటే పరస్పర సంబంధంగల ఒకే కోవకు సంబంధించినవారై ఉండవచ్చు. వీరికి ట్యూటన్లతో ఏదోఒకవిధంగా కొంత సంబంధం ఉండి ఉంటుంది.

4. ఇప్పటికి ఏడెనిమిది వేలేండ్లక్రిందటే ఈజిప్టునుంచి చీనావరకూ ఒకే నాగరికత వ్యాపించి ఉన్నట్లు బాబిలన్ మొహెంజొదారో మొ॥ భూగర్భాన బడిన నగరాలద్వారా తెలుస్తోంది. వీరు అసురసంతతివారని కూడా ఊహించ బడుతోంది.

5. తెలుంగులు (ద్రావిడులు) అరబ్బులు, ఫోనీషి యనులు, గ్రీకులు, రోమనులతోనూ, సిరియాతోనూ, ఈజిప్టు, మెడగాస్కర్, మొ॥ ఆఫ్రికా దేశాలతోనూ, మధ్యయుగాల్లో వరసగా తురుష్కలు, వెనీషియన్లు, బుడతకీచులు, వలందులు, పరాసులు, ఇంగ్లీషువారితోనూ వర్తకంచేశారు. బాబిలన్ (క్రీపూ. 3000 - 1300) సామ్రాజ్యంతోనూ, పారసీక

సామ్రాజ్యంతోనూ, చీనా జపాన్లతోనూ, వర్తకం చేసినట్లు పరస్పరం వలసలేర్పచుకొన్నట్లు నిదర్శనాలున్నాయి. అంతే కాదు. ఫిలిప్పైనులు ఇండోచైనా, సయాం, మలయా, బర్మా, ఇండోనీషియా సింహళదేశాలతో వర్తక వాణిజ్యాది సంబంధాలు, మతసాంస్కృతిక సంబంధాలేకాక, వలసలూ, రాజ్యాధిపత్యాలూ, అక్కడి తెగలతో కలసి పోవడాలు జరిపినట్లు తెలుస్తోంది. సింహళానికి 14 లక్షలమంది బౌద్ధ భిక్షువులు మన పల్లవభోగం (పలనాడు) నుంచి వలసవెళ్ళినట్లు విదితమవుతోంది. ప్రాచీన ఈజిప్టు మమ్మీలకు మన రవసెల్లాలు కప్పియుండడంవల్ల ఈవర్తకం క్రీ. పూ. 2-3 వేల ఏండ్లనుంచీ సాగుతున్నట్లు స్పష్టమవుతోంది. ఒక్కమాటలో ఇంచుమించు పూర్వార్ధ గోళమందలి సమస్త దేశాలతో సంబంధమున్నట్లు చెప్పవచ్చు. (రెడ్ ఇండియన్ల ఆచార వ్యవహారాదులను పరిశీలించిన కొంతమంది పశ్చిమార్ధ గోళంలో కూడా సంబంధమున్నట్లు చెపుతున్నారు.) కనుకనే (గ్రీక్, హీబ్రూ), మొ॥ భాషల్లో ఆంధ్రద్రావిడ సంస్కృత ప్రాకృతపదా లనేకం కన్పిస్తున్నాయి. ఆ యాభాషల్లోని పదాలు మనభాషల్లోనూ లభిస్తున్నాయి.

6. 'దేశి' అనేభాష సంస్కృత ప్రాకృతాలకంటె ముందు హిందూ దేశమందంతటా వివిధద్రావిడ తెగల్లోనూ వ్యాపించి ఉండేది. దానినుంచే నేటి ఆర్యద్రావిడ భాషల్లోగల 'దేశ్య' పదాలు చాలవరకు ఉత్పన్నమయ్యాయి.

7. నేటి తెలుగుజాతి హెచ్చుగా అనేక తురేనియన్ తెగలయొక్క, కొంతవరకు ఆర్య తెగల యొక్క, కొంచెముగా సెమిటిక్ హామిటిక్ తెగలయొక్క సమ్మేళనంవల్ల ఏర్పడిందని చెప్పవచ్చు. కొంచెం వివరంగా చెప్పాలంటే- తెలుగు, యక్ష, నాగ; తమిళ, కన్నడ. గోండు, కోయ, సవర, ముండా, కోదు, తోడా, ఒరయాన్, మాల్తొ, ఆంధ్ర, పుళింద కాళింగ, ఆర్య, అరబ్, తురుష్కాది వివిధ తెగల సమ్మేళనం వల్ల ఏర్పడి ఉంది. తెలుగు భాషకూడా ఆయా తెగల భాషల సమ్మేళనంవల్ల ఏర్పడిందని చెప్పవచ్చు.

8. వివిధ జాతుల వైదిక, పౌరాణిక, జానపద గాథలూ ఋజువయితే, వివిధ ప్రాచీన జాతులనేకం సుమారు 10 వేల సం॥ పూర్వమున్న దేవాసురుల సంతతివారేనని తేలవచ్చు. కనుక పరస్పర విభిన్నంగా కన్పడే అనేక ప్రపంచ జాతుల భాషల్లోని మూల పదాల్లో సాదృశ్యం కన్పించడాని కదొక కారణమై యుండవచ్చు.

9. ట్యూటన్లతో బాటు ట్యురేనియన్లు కూడా మిగతా ఆర్య తెగలకు సోదరులై ముందుగా తమ ఆదిమ భూమినుంచి పశ్చిమాసియాకు ఉత్తర ఐరోపాకు భారతదేశానికి, చైనా జపానులకు, ఆగ్నేయాసియా దేశాలకు వలసవెళ్ళి వుంటారు.

10. నీగ్రో మొ॥ నల్లని జాతులు అన్నిటికంటె ప్రాచీనమైనవి కావచ్చు. లేక పై జాతుల్లో వారే అయినప్పటికీ కొన్ని వేల సంవత్సరాలనుంచి భూమధ్య రేఖాప్రాంతంలో నివసించ

డంవల్ల వారి కా రూపువచ్చి యుండవచ్చు. వారి భాషను జాగ్రత్తగా పరిశీలిస్తే వాస్తవం కొంత బోధపడ గలదు.

11. తిర్యగ్జాతులకు మానవులకు సంబంధమున్నట్లు వర్ణించే గాథలు వారి ఆదిమ మత విశ్వాసాలకు సంబంధించి వారు పెట్టుకొన్న గణాల, తెగల, శాఖల, గోత్రాల పేర్లకు వారి వేషాలకు ఫలితాలై ఉంటాయి.

12. అతి ప్రాచీన భూగోళస్వరూపానికి ప్రస్తుతభూగోళ స్వరూపానికిగూడా చాలాభేదం ఉంది. అనేక హిమ ప్రళయాలు, జల ప్రళయాలు, భూకంపాలు అగ్ని (లావా) వర్షాలతో భూమ్యుపరి తలంలో చాలా మార్పులు జరిగి ఉన్నాయి. నేడు సముద్రమున్న చోట ఒకప్పుడు భూమీ, ప్రస్తుతం భూమీ కొండలున్న చోట ఒకప్పుడు నదీనదాలు, సరస్సులూ, సముద్రాలూ ఉండేవి. భూగర్భశాస్త్రజ్ఞులు భూమి పొరలనుబట్టి దీనిని రుజువుచేస్తున్నారు గూడా. దీని ప్రకారం దక్కన్ పీఠ భూమి ఆర్యావర్తంకన్నా ముందేర్పడిందనీ, పూర్వార్ధగోళం లోని ఖండాలు దీవులూ ఒకప్పుడు చాలావరకూ కలిసివుండే వనీ తెలుస్తోంది. కనుక స్థిరజీవనం లేని ఆదిమయుగాల్లో లేస పెఱలోని తేనెటీగల్లా సంచారశీలములైన వివిధ గణాలు తెగలు అనేకం నిరంతరం ఒక చోటినుంచి మరొక చోటికి పరిభ్రమిస్తుం డేవి. పరస్పరయుద్ధాల్లో కొన్ని కొంతవరకు నశిస్తుండేవి. ఒక దానితో ఒకటి సమ్మిళిత మవుతుండేవి.

13. వేదాల్లోని ప్రకృతివర్ణన, దీర్ఘరాత్రులు, సుదీర్ఘ దివసాలు, దీర్ఘ ఉషస్సు (అరోరా) లు మొ॥ కాలమానవర్ణన, వివిధ ఖగోళ వర్ణనలనుబట్టి ఆర్యులు (దేవతలు) హిమప్రళయా

నికిముందు నేటికంటె వాసయోగ్యమైన ఉత్తరధ్రువ ప్రాంతంలో నేటి సైబీరియా (స్వర్గం?) లో నివసిస్తుండేవారనీ, అంతకు పూర్వమేగానీ, హిమ ప్రళయానంతరం నశించగా మిగిలిన వారుగానీ క్రమంగా అక్కడినుండి అనేక ఆసియా ఐరోపా దేశాలకు పరిక్రమించి ఉంటారనీ శ్రీ లోకమాన్య తిలక్ తన 'వైదిక నిలయం'లో వివరించారు. నేడు సోవియట్ ప్రభుత్వం సైబీరియాను తిరిగి వాసయోగ్య మొనర్చింది. ధ్రువప్రాంతంలో పరిశోధనలు జరుపుతోంది. సైబీరియాలో భూగిర్భ పరిశోధ నలు జరిపితే, యీ విషయం కొంతవరకు స్పష్టంకాగలదు.

మధ్యాసియాలోని పామీర్ పీఠభూమి గానీ, లేక ధ్రువ ప్రాంతంగానీ, ప్రాచీనార్యుల నివాస స్థానమనుకొంటే, దానికి దిగువను,చుట్టుప్రక్కలనుఉన్న వివిధ(రాజకీయ)భూభాగాలు సప్త పాతాళాలుగాను, చతుర్దశ భువనాలుగానూ అనుకోడానికి తగిన ఆధారాలు కన్పిస్తున్నాయి. [కొంతమంది నేటి దక్షిణ హిందూస్థానమో, లేక అమెరికా ఖండమో నాటి పాతాళ మని చెపుతున్నారు.]

ఆముదర్యా,(హిమ-(హేమ)గంగా)సిర్ దర్యా (స్వర్గంగా) మొ॥ పచ్చనినదులు, పచ్చని (బంగారు) మట్టి ఇప్పటికీ కన్పిస్తు న్నాయి. చీనాలోగూడా నదులు సముద్రాలు, మట్టి, మను షులు చాలవరకు పచ్చగా ఉండడం అందరికీ విదితమే. మట్టి, వాతావరణం మొ॥ జీవజాలం రంగులకు కారణం. మధ్యాసియా లోని వివిధదేశాలు, పట్టణాలపేర్లు, ఇప్పటికీ అక్కడ నివసి స్తున్న చిన్నచిన్న జాతుల తెగలపేర్లు ప్రాచీన వాఙ్మయంలోని వర్ణనలు కొంతవరకు యథార్థమే అని సూచిస్తున్నాయి.

(చూడండి పదకోశం) అంతేగాక యీ ప్రాంతంలో ఒకప్పుడు వైభవాన్ననుభవించి పాడుబడియున్న పట్టణాల ఛాయలు పాటి దిబ్బల రూపంలో గోచరిస్తున్నాయి. సోవియటు ప్రభుత్వం ఇక్కడ పరిశోధనలు ప్రారంభించింది.

14. మధ్య ఏషియానుండి సహితం అందరూ ఒక్క సారిగా ఎప్పుడూ వచ్చి ఉండలేదు. తెరలు తెరలుగా వస్తుండే వాళ్ళు. ఇప్పటివరకు అలాంటివి ఏదో ఒకరూపంలో జరుగు తూనే ఉన్నాయి. ఒక్క మధ్య ఏషియాలోనేగాక ప్రాచీన భూప్రదేశాల్లో మరికొన్ని చోట్లగూడా మానవ జననం జరిగి ఉండవచ్చు. స్థిరజీవనంలేని వేల సంవత్సరాలలో ప్రపంచమంతటా అనేక తెగలు చెల్లాచెదరై సమ్మిళితములై పోయాయి. కొన్ని కేవలం ఆటవిక తెగలై వేల సంవత్సరాలుగా తమ ప్రత్యేక వ్యక్తిత్వం నిల్పుకొంటున్నట్లు కన్పించినా వాటిల్లో కన్పించే భాషాసాదృశ్యాన్ని బట్టి ప్రబలములైన తెగలు కొన్ని రాజ్యాలు స్థాపించడం మొదలుపెట్టినదగ్గరనుంచీ వాటి హింసా కాండలకు, బానిసత్వాలకు భయపడే పై తెగలు కొండలు కోనలు పట్టి వుంటాయనేది ఋజువవుతున్నది.

15. కనుక ఏవిధంగా చూచినా నేటి మన తెలుగు భాష అంతకు ముందు అతి ప్రాచీనకాలంనుంచీ మన దేశంలో నున్న ఆదిమనివాసుల భాషలతోటీ, ద్రావిడ భాషావర్గం (తేక కుటుంబం) లోని తనకు సజాతీయములైన తోడి ద్రావిడ (దాక్షిణాత్య) భాషలతోటీ, తదుపరి ఆర్యుల నిరంతర దండ యాత్రలవల్ల వారి పరిపాలన, వారితో సలిపిన జాతి (వర్ణ) సాంకర్యవల్ల ఆర్యభాషలైన సంస్కృత ప్రాకృతాది భాషల

తోటీ, వాటిద్వారా తదితర ఇండో-యూరపియన్ - మధ్య ఏషియా భాషలతోటీ, అటుపిమ్మట సింహళం, టిబెట్, బర్మా, సయాం, మలయా, ఇండోనీషియా, ఫిలిప్పైన్లు, ఇండోచైనా, చైనా, జపాన్ మొ॥ ప్రాచ్యదేశాలతో జరిగిన వ్యాపార మత సాంస్కృతిక అధినివేశ సాంఘిక రాజకీయాది సంబంధాలవల్ల ఆయా భాషలతోటీ, అలాగే మధ్య ప్రాచ్య పాశ్చాత్య దేశాలతో జరిగిన సంబంధాలవల్ల ఆ యా భాషలతోటీ, ముఖ్యంగా మధ్యయుగాల్లోని మహమ్మదీయుల వ్యాపార, మత, సాంఘిక, సాంస్కృతిక సామ్రాజ్య సంబంధాలవల్ల టర్కిష్, అరబిక్, పర్షియన్ ఉర్దూ భాషలతోటీ, నేటి ఉత్తర హిందూస్థాన భాషలైన హిందీ, బెంగాలీ, మరాఠీ, ఒరియా మొ॥ భాషలతోటీ, తిరిగి ఇటీవల వివిధ ఐరోపా దేశవాసుల వాణిజ్య సామ్రాజ్య పారిశ్రామిక మత సాంస్కృతికాది సంబంధాలవల్ల వారి వివిధ భాషలతోటీ సంబంధాలు కలిగియున్నది. ఆయాభాషల వివిధ పదజాలంతో సంకీర్ణమై యున్నది. ఒక్కమాటలో దాదాపు ప్రపంచంలోని ముఖ్యభాషలన్నిటితో ప్రత్యక్షంగాగాని పరోక్షంగా గాని పారస్పరిక సంబంధాలు, సాదృశ్యాలు మన భాషలో ప్రతిబింబిస్తున్నాయి.

అలాగే, ఇంగ్లీషువగైరా భాషలు కూడా ఇలాంటి సంబంధాలద్వారా తమలో అనేక భాషలతాలూకు పదజాలాన్ని ఇముడ్చుకొని లక్షలకొలది పదాలతో నేడు పెద్ద భాషలుగా పరిపక్వ భాషలుగా అభివృద్ధి చెందాయి. "అన్నిటికన్నా గొప్పజాతులు అన్నిటికన్నా ఎక్కువగా విజ్ఞానాన్ని అరువు పుచ్చుకొని ఉన్నాయి" (ఆర్. యస్. వుడ్‌వర్త్) అనే

సూక్తి భాషలకు సంబంధించిన యీ విషయంలో యథార్థ మవుతుంది, అంతేకాదు. విజేతృ (జాతుల) భాషలు పరాజిత (జాతుల) భాషలను అణచి వేయడమేగాక వాటినుంచీ అవి యెంతో అభివృద్ధి పొందుతాయి. అలాగే పరాజిత జాతుల భాషలు సయితం పైవాటినుంచీ కొంత పదజాలాన్ని చేర్చుకొంటూ తమ ప్రాథమిక స్వరూపాన్ని నిల్పుకోడానికి పోరాడుతాయి. ఇంగ్లీషుకు – తెలుగుకు గల కొన్ని సాదృశ్యాలను క్లుప్తంగా యీ దిగువ విధంగా క్రోడీకరించవచ్చు.

## ఇంగ్లీషు-తెలుగు సాదృశ్యాలు

1. పదకోశాన్ని మాత్రమే గణనలోకి తీసుకొంటే ఇంగ్లీషు ఒక సంశ్లిష్టభాష. ముఖ్యంగా కెల్టిక్, ట్యూటనిక్, ల్యాటిన్ అనే ఒకే కుటుంబానికిచెందిన మూడు తెగల భాషలతో అది సంకీర్ణమైవుంది. ఇంకా గ్రీక్ మొ॥ అనేక భాషల పదజాలాన్ని తనలో చేర్చుకొంది. కాని, నిర్మాణంలోనూ, వ్యాకరణంలోనూ, ప్రత్యయాలు మొ॥ నిర్మాణసామగ్రిలోనూ, అది పూర్తిగా ట్యూటనిక్ తెగకు చెందింది.

అలాగే తెలుగు సయితం ద్రావిడార్య తెగలకు సంబంధించిన తెలుగు–దేశి, సంస్కృత, ప్రాకృత భాషల పదజాలంతో మిళితమై వుంది. కాని, నిర్మాణంలోనూ, వ్యాకరణంలోనూ మాత్రం ద్రావిడ తెగకు చెందింది.

2. ఇంగ్లీషులో ట్యూటనిక్ మాటలు లేకుండా రచన సాగనట్లుగా తెలుగులో ద్రావిడ పదాలు లేకుండా సాగదు.

3. పారిశ్రామిక పెట్టుబడిదారీ యుగంలో తన వలస సామ్రాజ్య విధానాల మూలాన ఇంగ్లీషు నేడు ప్రపంచంలో వివిధ ప్రాంతాల్లో వ్యాపించినట్లు తెలుగు ఒకప్పుడు తన వ్యాపార మత వలస సాంస్కృతిక సంబంధాలద్వారా ఇండియాలో చాలా భాగంలోనే కాకుండా ప్రపంచంలో అనేక ప్రాంతాల్లో, ముఖ్యంగా ఆగ్నేయాసియా దేశాల్లో వ్యాపించి ఉంది.

4. చరిత్ర తెలిసినంతవరకు ఈ రెండు భాషలు ఇంచుమించు ఒకేసారి ప్రాదుర్భవించి వుంటాయి.

5. మధ్యమ పురుషక్రియలకు ప్రత్యయ లోపము, డాంత భూతక్రియారూపాలు రెండింటిలో కన్పించడం.

6. సర్వనామాలు, సంఖ్యావాచకాలు మొ॥ అత్యావశ్యక పదజాలంలో కొంత పరస్పర సాదృశ్యం.

కనుక, ఏ భాష కా భాష తన పరిధిలోనే తన ప్రాథమిక స్వరూపంతోనే చాలవరకు అభివృద్ధి పొందుతున్నప్పటికీ, పై సంబంధాలవల్ల ఏ ఒక భాషలో సంపూర్ణపాండిత్యం సంపాదించవలెనన్నా, ఆ భాషతో అత్యధిక సంబంధం కలిగియున్న మరికొన్ని భాషలతో కూడా కనీస పరిచయం నేడు కలిగియుండవలసి యున్నది. చక్కగా నేర్చుకొన్న ఒక్క మాతృభాష సహాయంతో ప్రపంచ భాషలన్నిటినీ కాకపోయినా, ముఖ్యమైన కొన్నిటినైనా 'ప్రత్యేకంనుంచి సాధారణానికి' అనే న్యాయం చొప్పున నేర్చుకోవడం సాధ్యమవుతుంది. అయితే, ప్రస్తుత సాంఘిక విద్యావిధాన బోధనా పద్ధతులద్వారా అన్ని భాషలతో పరిచయం కలిగించుకోవడం కష్టసాధ్యమైనవిషయం.

నేడు సోవియటు రష్యాలో పాఠశాలలన్నిటిలోనూ దశవర్ష పాఠ్య ప్రణాళికలో బాలబాలికలకు వారి మాతృభాషతోబాటు రష్యన్ భాషనూ, ఒక విదేశీ భాషనూ నేర్పడానికి వీలు కల్పించబడింది. ప్రజాచైనాలో చైనాభాషతోబాటు రష్యన్ భాషను రెండవభాషగా నేర్పుతున్నారు.

## భాషాశాస్త్రం - భాషాధ్యయనం

అందుచేత, భాషా శాస్త్రరీత్యా భాషాబోధన జరగవలసి యున్నది. భాషాశాస్త్ర మూలసూత్రాలను ఆ యా భాషల బోధనలో ఉపయోగించుకోవలసి యున్నది. సాధారణ భాషా బోధనా పద్ధతులలో భాషాశాస్త్ర పద్ధతులను ప్రవేశ పెట్టవలసి యున్నది. సాధారణ వర్ణనాత్మక వ్యాకరణాలను భాషాశాస్త్ర దృష్ట్యా తిరిగి వ్రాయవలసి యున్నది.

ఆ యా భాషలకు సంబంధించిన భాషాశాస్త్రం నేడు ఆ యా భాషలను ప్రత్యేకంగా చదివే (స్పెషలైజ్ చేసే) పట్టభద్రులకు మాత్రమే తగుపాటిగా బోధించబడుతోంది. ఆ పరీక్షల్లో ఉత్తమ తరగతుల్లో ఉత్తీర్ణులైన వారిలో నూటికి ఒకరిద్దరికి సయితం యీ శాస్త్రంలో పరిశోధన చేయడానికి అవకాశం కల్పించబడడం లేదు. కాని, మిగతా విషయాలను తీసుకొని పట్టభద్రులయ్యే వారికి గానీ, తదనంతర పరీక్షలకు చదివేవారి (పోస్టుగ్రాడ్యుయేట్సు) కి గానీ, వారి క్రింది తరగతుల వారి (అండర్-గ్రాడ్యుయేట్స్) కి గానీ, సెకండరీ తరగతులకు గానీ యీ ఆధునిక శాస్త్రంతో అంతగా సంబంధం ఉండడం లేదు.

అంతేగాక నేటికీ పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ వ్యాకరణాలు పాతపద్ధతుల్లోనే బోధించడమూ, లేక వ్యాకరణాలు అసలే బోధించకపోవడమూ కూడ జరుగుతోంది. అందుచేత పై విద్యార్థులతోబాటు ఏదో కొద్దిగా చదువుకొన్న లేక-పూర్తిగా నిరక్షరాస్యులైన కోటానుకోట్ల వయోజనులకు సయితం ఈ పద్ధతి ద్వారా ఆ యా భాషలను నేర్ప మొదలిడితే ఎంతో ఉపయోగం ఉంటుంది. త్వరితంగా సమగ్ర దృష్టితో వివిధ భాషలను నేర్చుకోవడం సాధ్యపడుతుంది. తత్ఫలితంగా వివిధజాతుల మధ్య శాంతి సౌమనస్యాలు వర్ధిల్ల గలవు. ఉదా:

| సం॥తత్సమ | తద్భవ-తె. | తద్భవ-హిం॥ | ఇంగ్లీషు | రష్యన్ | గ్రీక్ | ల్యాటిన్ |
|---|---|---|---|---|---|---|
| భ్రాతర్ | తమ్ముడు | బిరాదర్ | Brother | Brat | Phrater | Frater |
| చతుర్ | చవు,చా | చార్ | Four | Cetvero | Tettares | quatuor |
| ముష్టి | పిడి (కిలి) | ముశ్త్ | Fist | Pjast | Pygme | Pugnus |
| సద్(సీదతే) | — | — | Sit,Set | Sidete | — | Sedeo |
| చూష(తి) | చీకు | — | Suck | Sosate | — | Sugo |

ఈవిధంగా సుమారు 2000 కు పైగా ఆర్య (ఇండో-యూరపియన్) భాషల్లో ధ్వనిసామ్యం, అర్థసామ్యంగల మూల పదాలు(ప్రాతిపదికలూ, ధాతువులూ, ఉపసర్గలూ, ప్రత్యయాలూ మొ॥) చిరపరిశోధన ఫలితంగా లభించాయి. వాటినుంచి ఉత్పన్నములైన పదాలతో కలిపి అవి షుమారు 20,000 లకు పైగా కావడానికి అవకాశం ఉంది. ఇలాంటి ప్రయత్నాలు వివిధ దేశాలమధ్య సత్సంబంధాలు అధికతర మవుతున్నకొద్దీ

సుదూరభవిష్యత్తులో స్టాలిన్ వర్ణించినట్లు జోనల్ భాషల ఉత్పత్తికీ, తదనంతరం ప్రపంచభాషావిర్భావానికీతోడ్పడతాయి.

ముఖ్యంగా నేడు మన దేశంలో భాషాసమస్య రాజకీయంగా అత్యంత ప్రాధాన్యత వహిస్తోంది. భాష-భౌగోళిక-ఆర్థికాది సంబంధాలరీత్యా రాష్ట్రపునర్విభజన జరిగి మన దేశపు రాజకీయ భూగోళం ఎంతో మార్పుచెందవలసియున్నది. మనకు 'విశాలాంధ్ర' ఏర్పడవలసియున్నది. అప్పుడే మన దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందగలదు. జాతీయత అంతర్జాతీయత అభివృద్ధికావడానికి కావలసిన చైతన్యం ఇలాంటి భాషాశాస్త్ర-వ్యుత్పత్తి పద్ధతులు భాషాబోధనలో అనుసరించడం ఫలితంగా చేకూరగలదు. *

## చరిత్ర - చారిత్రకాధారాలు - భాష

ప్రపంచంలో ఏ దేశానికీ 5, 6 వేల సంవత్సరాలకు పూర్వపు చరిత్ర తగిన లిఖితాధారాలతో, సరైన చారిత్రకాధారాలతో ప్రత్యక్ష ప్రమాణంతో చారిత్రక పద్ధతిలోతగిన చరిత్రకారులు వ్రాసినది లేదనే చెప్పాలి. కనుక, మానవజాతి చరిత్రను నేడు వివిధజాతుల వేదపురాణ జానపద వాఙ్మయాది వివిధ సారస్వత శాస్త్ర పరిశోధనల సహాయమున అనుమాన ప్రమాణంతో గ్రహించవలసి యున్నది. గోర్కీ చెప్పినట్లు, 'జానపద వాఙ్మయం శ్రామిక ప్రజల నిజమైనచరిత్ర'ను తెల్పుతుంది. భూగర్భ శాస్త్రజ్ఞులు, పురాతత్వ శాస్త్రవే

* 'భాషాబోధనలో భాషాశాస్త్రపద్ధతి' అనే ఒక వ్యాసాన్ని ఇందలి ముఖ్యాంశాలుకొన్నిటితో 1954 ఆగస్టునెల, 'ఉపాధ్యాయ' సంచికలో ప్రకటించాను. —రచయిత.

త్తలు మానుషశాస్త్రవిదులు మొదలయినవారు భూగర్భం లోని పొరలనుంచి త్రవ్వి యెత్తిన ఆదిమ మానవులు వాడిన వివిధ పరికరాలు, మానవుల కంకాళాలు, శిలారూపం తాల్చిన ఎముకప్రోవుల (ఫాసిల్స్)నుబట్టి మానవ జననం జరిగి సుమారు 5 లక్షల సంవత్సరాలకు పైగానే అయివుంటుందని ఊహిస్తు న్నారు. అందులో హెచ్చుకాలం మానవుడు ఆటవిక మృగ దశలోనే గడిపాడనేది నిర్వివాద విషయం.

కాగా మిగిలిన చారిత్రకాధారాల్లో మొట్టమొదటిదిగా భాషనే పరిగణించవలసి యున్నది. "అభివృద్ధి క్రమంలో విషయం రూపం కంటె ముందు వస్తుంది. రూపం విషయం కంటె వెనుకబడుతుంది." అని స్టాలిన్ చెప్పిన సూత్రాన్ని బట్టీ, "అర్థం తెలుసుకొన్న మీదటనే శబ్దాన్ని ప్రయోగించడం" ('అర్థం బుద్ధ్వా శబ్దరచనా') అనే న్యాయాన్ని బట్టీ, వస్తువు ననుసరించియే దాని సంకేతం ఉండడంవల్ల, ఆ యా భాషల్లో వున్న వివిధ శబ్దాలను బట్టి వాటిని మాట్లాడేవారికి తెలిసివున్న విషయాలేవో ఆ నాటి ఉత్పత్తి పరికరాలు, ఉత్పత్తివిధానాలు, ఆర్థిక, సాంఘిక, రాజకీయాది వివిధ విషయాలు ఎలాంటివో మనం ఊహించుకోగలం.

## భాషా సంబంధ నిర్ణయం

ఈ విషయాన్ని గురించి 'రాస్క్' అనే జర్మన్ పండితు డిలా వివరించి యున్నాడు.

"లిఖితాలు లేని ఆ యా జాతుల చరిత్రను భాష మూలముననే తెలిసికొన సాధ్యమగును.

ఒక భాష కితరభాషలతోడి సంబంధాన్ని తెలిసికోడానికి దాని నిర్మాణమును గూర్చి యాలోచించవలెనుగాని, ప్రత్యేక పదాలను గూర్చి యాలోచించగూడదు. సాధారణంగా పదాలను అరువు తెచ్చుకుంటారు గాని వ్యాకరణ రూపాలను అరువు తెచ్చుకోరు. మిక్కిలి చిక్కయిన వ్యాకరణ నిర్మాణం గల భాష మాతృకకు దగ్గరగా ఉంటుంది. భాష ఎంత సంకీర్ణ మయినా అత్యావశ్యక పదా లితర భాషల పదాలతో సంబంధించి యున్నయెడల ఆ యా భాషలు పరస్పర సంబంధం కలవని చెప్పవచ్చు. 1) సర్వనామాలు 2) సంఖ్యావాచకాలు మొ॥ ఇందు ముఖ్యమైనవి. రెండు భాషల యుచ్చారము (ధ్వను) లందు సామాన్యపరిణామం, నిర్మాణవిషయంలో సాదృశ్యం కన్పిస్తున్నయెడల పరస్పర సంబంధం ఆ రెండు భాషలకు కలదని నిశ్చయంగా చెప్పవచ్చు."

ఈ విధంగా ప్రపంచంలోని వివిధ భాషలను సాధర్మ్య వైధర్మ్య దృష్టితో కొంతవరకు అధ్యయనం చేసిన పిమ్మట ఆ యా భాషలకున్న పరస్పర సంబంధాలు, సాజాత్యం చాలవరకు తేటపడగా భాషలన్నిటిని వివిధకుటుంబాలుగా భాషా శాస్త్రవేత్తలు విభజించియున్నారు. ఇట్టి భాషా సాజాత్యం అకస్మాత్తుగా కానేరదు గాబట్టి అలాంటి సజాతీయ భాషలను మాట్లాడేవారు మొదట్లో ఒకచోట ఉండి ఉంటారనీ, బహుశః వారు ఒకే జాతికి చెందివుంటారనీ కూడా తేలుతుంది. ఉదాహరణకు ఇండో-యూరపియను భాషలు మాట్లాడే ఆర్యులు మొదట్లో మధ్యాసియాలో కాస్పియన్ (కాశ్యప) సముద్రానికీ హిందూ

కుష్ పర్వతాలకు గల మధ్యప్రాంతంలో నివసించివుండే వారనీ పై కారణాలవల్ల ఊహించవీలవుతుంది.

## భాష అంటే?

భాషించేది 'భాష'. 'భాష-వ్యక్తాయాం వాచి' అనే మూలపదంనుంచి 'భాష' అనే పదం పుట్టింది. 'లోక్ర-భాషాయాం' అనే మూలపదంనుంచి 'లాంగ్వేజి' అనే పదం ఉత్పన్నమయింది.

భావ ప్రకాశకం, వర్ణాత్మకం అయిన శబ్దమే భాష అవుతుంది. 'మార్క్స్' చెప్పినట్లు 'భాష భావం తాలూకు ప్రత్యక్ష వాస్తవికత'. భాష మానవుల సృజనాత్మక శక్తికి ప్రథమ నిదర్శనం. ఫలితం. కాని, భాష ఏదీ కేవలం ఒక ప్రత్యేక వ్యక్తిచే సృష్టించబడింది గాదు. అది సామాజికమైనది. భాష లేనిదే ఎలాంటి భావమూ స్పష్టంగా వ్యక్తీకరించబడజాలదు సరిగదా, అసలుభావమే ఉత్పన్నం కాజాలదు. మనిషి భాష సహాయంతోనే ఆలోచిస్తాడు. కనుక భావాలు భాష నుంచి విడివడి వుండవు.

## భాషోత్పత్తి

అప్పటి కప్పుడు పుట్టిన శిశువును సమాజంనుంచి వేరు చేసి ఏ అడవిలోనో ఏ ఒక్క మనిషితోనూ సంబంధంలేకుండా పెంచే ఏర్పాట్లు చేస్తే మనిషి పూర్తిగా పెరిగినా తల్లిదండ్రుల భాష తెలియని యాతడు ఏవో కొన్ని ప్రాథమిక భావాలను తెల్పే ధ్వనులను సంజ్ఞాభినయ చిత్రాది చేష్టలను మాత్రమే చేస్తాడు. ఆదిమమానవులు ఈవిధమైన ధ్వనులను, చేష్టలనే చేసి

వుంటారనేది స్పష్టపడుతోంది. భాషను వినికిడి ద్వారానే ప్రతి మనిషీ నేర్చుకుంటున్నాడు. మనిషి ఎక్కడ వుంటే, అక్కడి భాషను నేర్చుకొంటాడు. మొదట్లో అలాంటి సమగ్రమైన భాష ఉండేది కాదు. మాటల భాష మాత్రమే ఉండేది. కాని, కొంతమంది శిశువులను కలిపి అడవిలో పెంచితే వారు కొంతకాలానికి ఇతరులకు తెలియని ఏదో ఒక భాషను సృష్టించుకుంటారని ఊహించవచ్చు. కనుక భాష ఒకే చోటవున్న ఒక గణం, లేక తెగ యొక్క- లేక జాతియొక్క- సమష్టికృషిచే ఉత్పన్నమైనదనీ, సామాజికమైనదనీ తేటపడుతోంది.

ఈ సందర్భంలో స్టాలిన్ వ్రాసిన యీ క్రింది అంశాలను మనం అధ్యయనం చేయవలసి వున్నది.

"వర్గాలకు సంబంధించిన ఉపభాషలు [class-dialects] కొన్ని అపభ్రంశాలైన పదజాలాలు [Jargons] మాత్రమే. కొద్దిమంది పై వర్గాల వారికి తప్ప ప్రజాసామాన్యానికి ఉపయోగించవు. వాటికొక సొంత వ్యాకరణ వ్యవస్థ గానీ, సొంత మూల పదకోశం గానీ ఉండదు. అందుచేత అవి ప్రత్యేక భాషలుగా అభివృద్ధి పొందజాలవు. కాని, ప్రాంతీయ భాషా భేదాలు (ఉపభాషలు—లోకల్ డైలెక్ట్సు) అలా కాదు. జాతుల నిర్మాణ క్రమంలో అవి ప్రత్యేక భాషలుగా రూపొందుతాయి. కొన్ని ప్రాదేశిక (మాండలిక) భాషా భేదాలు ఈ జాతీయ-భాషల్లో లీనమైపోతాయి. అవసరమైన ఆర్థికాభివృద్ధి పరిస్థితులు లేక ఒకే భాషగల ఒక తెగ జాతిగా ఇంకా మారనపుడు-ప్రభుత్వ విభజన ఫలితంగా ప్రాంతీయభాషలు ప్రత్యేక

భాషలుగా రూపొందుతాయి. మంగోలియన్ భాష ఇందుకు దాహరణ.''

ఒక సమాజానికి అంతటికీ అర్థమయ్యే సాధారణమైన భాష లేకపోతే, ఆ సమాజం ఏమీ ఉత్పత్తి చేయజాలదు. ఆ సమాజం సమాజంగా మనజాలదు. భాష సమాజానికి వ్యవహార మాధ్యమికమే గాక దాని పోరాటానికి, అభివృద్ధికీ అది ఒక ప్రధాన సాధనం.

పదకోశం భాషయొక్క స్థితిని ప్రతిబింబిస్తుంది. అది ఎంత సమగ్రంగా ఉంటే, భాష అంత ఎక్కువ అభివృద్ధి గాంచుతుంది. కాని, పదకోశం మాత్రమే భాషకాదు. అది భాషకు నిర్మాణ సామగ్రి అవుతుంది. వ్యాకరణం అధీనంలో పదకోశం అద్భుత ప్రాముఖ్యత వహిస్తుంది.

## ధాతువులు - నామములు

సాధారణంగా భాష లన్నిట్లోనూ ఉండే పదకోశాలకు అందలి ధాతువులే చాలవరకు మూలపదాలుగా ఉంటాయి. కనుక, ధాతురూప-పరిజ్ఞానముతో భాషాపరిజ్ఞానం చాలవరకు సిద్ధిస్తుంది. పరిమితమైన యీ మూలపదాల సహాయంతో అపరిమితమైన వివిధ పదజాలాన్ని నిర్మించుకోవచ్చు.

అంతేకాదు. 'కలిః కామధేనుః' 'అనేకార్థాహిధాతవః' 'ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యత్ర నీయతే', 'ధాత్వర్థం బాధతే క్వచిత్' మొ॥ సూత్రాలనుబట్టి ఒకే ధాతువు కనేకార్థాలు ఉండడం, ప్రకరణవశాత్తూ, ఉపసర్గ సాహచర్యం వల్ల ఆ యా ధాతువుల అర్థాలు మారుతూండడం మనం చూస్తున్నాం.

ఉదాహరణకు- ఒక్క 'హృ=హరణే' అనే ధాతువునుంచి విభిన్నార్థాలు గల 'ప్రహారాహార సంహార విహార నీహార పరిహారాద్య' నేక పదాలు పుట్టాయి. ఉపసర్గ, ఉపపదం (prefix or Preposition) మొ॥ + ధాతువు, ధాతువు+ ధాతువు చేరి అసంఖ్యాక (సంయుక్త) ధాతువు లవుతున్నాయి.

సంస్కృతంలో నామములన్ని ధాతుజన్యములే అనే వాదం బలీయమై ఉంది. పాణినీయ వ్యాకరణం యీ వ్యుత్పత్తి పక్షానికే ప్రాముఖ్యత యిస్తోంది. మొత్తంమీద వివిధభాషల్లో నేడు కన్పించుతోన్న నామములన్నీ కాకపోయినా, చాలవరకు ధాతు జన్యములని చెప్పవచ్చు. క్రియావ్యవహారంలో లేకపోయినా తన యీ వాదాన్ని సమర్థించుకోడానికి గానీ, లాఘవాపేక్షచేగానీ వివిధ నామాల్ని సాధించడానికి వీలుగా పాణిని 2000 ధాతువుల్ని ధాతుపాఠంలో పఠించాడు. ఇందు నేడు మనకు లభించే మొత్తం వాఙ్మయంలో సుమారు 900 ధాతువులు మాత్రమే గన్పిస్తాయి. వైదిక సంస్కృత వాఙ్మయాలు రెంటిలో కన్పించేవి సుమారు 400 మాత్రమే. మరికొన్ని ప్రాకృత వాఙ్మయంలోను, ఆనాటి వ్యావహారిక భాషలోను ప్రయోగించబడుతుండేవి. మనకు లభించని వాఙ్మయంలో గూడా కొన్ని ఉండవచ్చు. అర్థభేదాన్ని బట్టి ఒకేధాతువును అనేకసార్లు పఠించడం, రూపాంతరాల్ని గూడా వేరు వేరుగా స్వతంత్రధాతువులుగా పరిగణించడం జరిగింది. ఆదిమ మానవుడు జంతు ప్రపంచాన్నుండి ఉద్భవించాడు గనుక ఆటవిక దశలోని ప్రాథమికావస్థలో 'మాట' ద్వారా అభిప్రాయ ప్రకటన చేస్తుండేవాడు. (సర్వ) నామ ధాతుమిశ్రితమైన ధ్వా

మాట ఒక మాటగానే కన్పడుతున్నప్పటికీ, నిజానికిది వాక్య సదృశమే అవుతుంది. ల్యాటిన్, సంస్కృత, ద్రావిడాది భాష ల్లోని క్రియాపదాలను విశ్లేషించి పరిశీలిస్తే యీ విషయం బోధపడుతుంది.

ఆదిమ యుగాల్లో వలసలు మొదలగు వాటివల్ల, వివిధ భాషలు మాట్లాడే వివిధ గణాల తెగల సాంకర్యంవల్ల ఆయా భాషల్లో సయితం పరస్పరం సజాతీయాలూ, విజాతీయాలూ అయిన వివిధ తెగల భాషల్లోని మూలపదాలెన్నో సమ్మిశ్రిత మై యున్నాయి.

సంస్కృత ధాతువులు మొ॥ వాటిల్లో ఇత్సంజ్ఞకాలు, వికరణ భాగాలు, ఉపసర్గలు, ప్రత్యయాలు మొ॥విగా పేర్కొన బడినవి, ఇతర భాషల్లోని వాటికి తుల్యమైన మూలపదాలను పరిశీలిస్తే, అవి మూలపదాల్లోని భాగాలే అనేది తెలుస్తోంది. ఉదాహరణకు—1)డుధాఞ్=(D)Doen—లేక భాస్=Flash 2) భిదిర్=(L) Findo 3) సం+వృఞ్=cover 4)సీదతే=(R) Sidete.

## భాషలు - నిర్మాణభేదాలు

పదసామ్యకృతమైన వంశ విభాగం కాక, భాషలకు పద సంవిధానకృతమైన మరొక విభాగం కలదు. దీనినే వ్యాకరణ సామ్యకృత భాషావిభాగమని కూడా అంటారు.

1. ప్రత్యయరహిత భాషలు—వీనిలో ప్రత్యయములుం డవు. కావున పదాలన్నీ ఏకాచ్కములైన ధాతువుల రూపంగా

ఉంటాయి. పదాలకుండే పరస్పర సంబంధం ప్రత్యేక పదాల వలనగానీ, వాక్యములో పదాలస్థానమును బట్టిగానీ తెలిసికొనవలసి యుంటుంది. చీనా భాష యీవిధంగానే ఉంటుంది. దీని నందుచేతనే 'ధాతుమయి' [Radical] అని అంటారు.

2. స్పష్ట ప్రత్యయభాషలు— లేక సంసృష్ట భాషలు [Agglutinating Languages]. ఈ భాషలలో ప్రకృతి ప్రత్యయములు మార్పుచెందక స్థిరముగా నుండడంవల్ల తద్విభాగం సుకరమై ఉంటుంది. తెలుగు మొ॥ ద్రావిడ భాషలును టర్కిష్ భాషయు ఈ విధంగా ఉంటాయి.

3. అస్పష్ట ప్రత్యయభాషలు—లేక సంకీర్ణ [Amalgamating] భాషలు. వీనిలో ప్రకృతి ప్రత్యయాలు కలిసే సమయంలో కలిగేవర్ణ విపరిణామాలవల్ల వాని స్వరూపం పోల్చడం కష్టమై తద్విభాగం దుష్కరమవుతుంది. ఇండోయూరపియన్, సెమిటిక్ భాషలు ఈరీతిగా ఉంటాయి.

సెమిటిక్ భాషలకు మూడుహల్లుల ధాతువులు మూల పదాలైవుంటాయి. వీటిలో ఆ యీహల్లులమధ్య వివిధాచ్చులు చేరి వ్యాకరణరూపా లేర్పడుతుంటాయి. అంచేత అచ్చులు హల్లులకు అధీనమయి ఉంటాయిగాని ఆర్యభాషల్లోమాదిరిగా సమానపద్ధతిలో వుండవు.

'బాంటూ' మొ॥ భాషల్లో ప్రత్యయాలు ప్రకృతులకు ముందుచేరతాయి. ఆంధ్రాది భాషల్లో ప్రకృతులకు పరమవుతాయి. మరే భాషలో రెండువిధాలుగానూ చేరడంవుంది.

భాషలు మొత్తంమీద సంయుక్తము (Synthetic) లనీ, విభక్తము (Analytic) లనీ రెండురకాలుగా వున్నాయి. లింగసంఖ్యా కారకరూప విశేషార్థాలను ఒక్క సుప్ప్రత్యయమూ, రీతికాలపురుషసంఖ్యారూప విశేషార్థాలను ఒక్క తిఙ్ ప్రత్యయమూ బోధించే పద్ధతిగల భాషలు సంయుక్తములన బడతాయి. ఒక ప్రత్యయమందుండే యీ విశేషార్థాలు విభక్తములై వేరువేరు పదాలచే చెప్పబడే పద్ధతిగల భాషలు విభక్తము లనబడతాయి.

## భాష - వర్గభేదం

భాషను ఏ ఒక్క వర్గమూ ఉత్పత్తి చేయడంలేదు. ఒక జాతి తరతరాలుగా యుగయుగాలుగా చేసే సమష్టికృషి ఫలితంగానే భాష అభివృద్ధి చెందుతోంది. ఒక వర్గమే దానిని ఉపయోగించదు. అన్నివర్గాలూ ఉపయోగిస్తాయి. ప్రతివర్గానికీ ఒకొక్క భాష ఉన్నట్లయితే వర్గాలమధ్య సంబంధమే సాధ్యంగాదు. అలాంటి సంబంధమే లేకపోతే ఉత్పత్తి కుంటుపడుతుంది. అందుచేత అధికారం ఒక వర్గం చేతినుంచి మరొక వర్గం చేతిలోకి మారినంత మాత్రాన భాషలో వచ్చే పెద్ద మార్పులేమీ ఉండవు. భాష ఒక ప్రత్యేక సాంఘిక వ్యవస్థను పురస్కరించుకొని ఉండేదికాదు. దానితో మారదు. అది చిరకాల సాంఘిక చారిత్రిక పరిణామ ఫలితంగా ఏర్పడి వృద్ధి చెందుతుంది. భాష అన్ని వర్గాల ఉమ్మడి సొమ్ము. కాన పాలక (దోపిడి) వర్గాలు రద్దు అయినంత మాత్రాన భాష రద్దుకాదు. ఉదాహరణకు- 'ఇల్లు, వాకిలి' మొ॥ మాటలు

పుట్టి ఎన్ని వేల ఏళ్లయినా, ఈనాటికీ ఆ మాటల నాయర్థంలోనే వాడుకొంటున్నాం.

భాష ఒక విధంగా ఒక పనిముట్టులాంటిది. పెట్టుబడి దారీ యుగంలో పెట్టుబడిదార్లకు పనికివచ్చిన యంత్రాలు వగైరా విప్లవానంతరం కూడా అందరికీ పనికి వచ్చినట్లుగానే భాష కూడా ఉపకరిస్తుంది.

వివిధవర్గాలు ప్రత్యేక పదజాలాన్ని వాడవచ్చు. ఆ పద జాలం వేతే భాష కాదు. జాతీయభాషకు వేసే పిలకలు మాత్రమే. భాషకు ప్రధానమైనది వ్యాకరణమూ మూలపదా లూనూ. ఇవి సాంఘిక వ్యవస్థ మారినంత త్వరగా మారవు.

వర్గభాష అనేది ఎప్పుడూ లేదు. ఒక జాతికీ, సమాజా నికి సర్వసాధారణమైన, వర్గాలతో నిమిత్తం లేని భాషయే మొదటినుంచీ ఉన్నది. ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో వర్గాలు అనేవి లేవుగదా! అప్పటి గణసమాజంలోని సభ్యులందరూ ఒకే భాష మాట్లాడుతూ ఉండేవారు. తరువాత ఆ గణ భాషలు కాలక్రమేణ తెగ భాషలుగానూ, తెగ భాషలు జాతి భాషలుగానూ, పిమ్మట ఆర్థిక రాజకీయ కేంద్రీకరణ జర గడం ఫలితంగా బూర్జువా వ్యవస్థలో జాతీయ భాషలుగానూ అభివృద్ధి చెందాయి. వాటితో బాటు మాండలికాలు వగైరా ఉండవచ్చు. కాని, అవి ఏకైకమూ, సర్వసాధారణమూ అయిన జాతిభాషలకు అతకబడి వాని కనుబంధంగా నేవున్నాయి. పెట్టుబడిదారీ విధానం అమలులోకి రాగానే జాతీయమార్కెట్ల ఫలితంగా భూస్వామ్య విభాగాలు నాశనం చేయబడి ఆ యా

జాతుల భాషలు జాతీయభాషలుగా అభివృద్ధి చెందాయి. కనుక, ఆదిమ కమ్యూనిస్టు (వర్గరహిత) సమాజం దగ్గరనుంచి సోషలిస్టు సమాజం వరకు ఆ యా భాషలను ఆ యా గణాలు, తెగలు, జాతులకు సంబంధించిన అందరూ ఉపయోగించు కొంటూనే ఉన్నారు. ఈ మధ్యజరిగిన అనేక విప్లవాలతో పాటు అవి మారవలసిన అవసరమూ లేదు. ఆవశ్యకతలేనిది ఏదీ మారదుగదా! కనుక, భాష జాతీయమైనది. మొత్తంజాతికి సంబంధించినది. కాని, ఏవో కొన్ని వర్గాలకు మాత్రమే చెందినది కాదు.

భాష సామాజికం కావడంవల్ల ప్రతి మనిషీ పుట్టినదాది సామాజిక సంబంధాల ద్వారా దానిని గ్రహించి ఉపయోగించ గలుగుతున్నాడు. ఆ సంబంధాలు లేనినాడు ప్రతిమనిషీ పశు తుల్యుడే అవుతాడు. ఈ మధ్య పత్రికలలో ప్రకటితమైన తోడేలు బాలుడు రాముని ఉదంతం యీ విషయాన్నే ప్రస్ఫుటం చేస్తుంది. సమాజం బాగుపడాలంటే నూటికి తొంభై మంది గర్భదరిద్రులుగా, నిరక్షరకుక్షులుగా, నోరున్నా, నోరూ వాయీ లేక ఉన్న యీ 'రామా'లాంటి వారి సామాజిక భౌతిక పరిస్థితులను చక్కదిద్దవలసిన ఆవశ్యకత నిది వ్యక్తం చేస్తుంది. 'అనువంశికతే (Heridity) యీ సమాజంలోని ఆ హెచ్చుతగ్గులకు మూలకారణం. సామాజిక వాతావరణం కాదు. అనువంశికత మార్చడానికి వీలులేనిది.' అనే బూర్జువా జీవశాస్త్రజ్ఞుల వాదంలో ఎంత పస ఉందో యీ సంఘటన బయట పెడుతోంది.

# భాష-పునాది-పై కట్టడం

భాష పునాదిలోనూ చేరదు. పై కట్టడంలోనూచేరదు. కాని, ఆ రెండింటిమాదిరిగానే భాష సమాజానికి సేవచేస్తుంది. ఇతర సాంఘిక దృశ్యాలన్నిటి మాదిరిగా గాక అది ఇంకా ఎక్కువే పనిచేస్తుంది. పునాది ఆర్థికంగా సమాజాన్ని సేవిస్తుంది. పై కట్టడానికి సంబంధించిన రాజకీయాది వివిధ భావాలు సమాజాన్ని సేవిస్తూ వివిధ సంస్థలను సమాజానికి సృజిస్తాయి. కాని, భాష ఉత్పత్తి రంగంలోనూ, ఆర్థిక సంబంధాలలోను, రాజకీయ వైజ్ఞానికాది వివిధరంగాలలోను దైనందిన జీవితంలోనూ, వ్యవహార సాధనంగా సమాజానికి ఉపయోగిస్తుంది.

భాష ఉత్పత్తిశక్తుల్లోనూచేరదు. ఉత్పత్తిసాధనాల్లోనూ చేరదు. ఉత్పత్తిసాధనాలు భౌతిక సంపదను సృష్టిస్తాయి. భాష అలాచేయడం లేదు.

పైకట్టడం మాదిరిగా పునాది రద్దుచేయబడేదాకా భాష నిరీక్షించవలసిన పనిలేదు. 1. కొత్తమాటలెన్నో వచ్చిచేరడం 2. లోగడఉన్న కొన్నిమాటలు అర్థం మార్చుకోవడం 3. కొన్నిటికి నూతన ప్రాముఖ్యత రావడం 4. మరికొన్ని పాతగిలి వ్యర్థమై పదకోశంనుంచి తొలగిపోవడం 5. వ్యాకరణవ్యవస్థ అభివృద్ధి పొందడంలాంటి మార్పులు భాషలో ఎప్పటికప్పుడు అవసరమైనప్పుడల్లా జరుగుతాయి.

పునాదీ, పై కట్టడమూ ఒక యుగానికి సంధించినవి మాత్రమే. భాష అన్నియుగాలకు సంబంధించినది. సాధారణంగా ముఖ్యమైన మార్పు త్వరగా – ఎంతో ఆవశ్యకత ఏర్పడితేతప్ప

భాషలో జరగదు. ఉదాహరణకు – నన్నయ తిక్కనలు వ్రాసిన తెలుగు భారతాన్ని కొన్నిపదాలు వ్యవహారభ్రష్టాలు ఐనప్పటికీ, వ్యాకరణ వ్యవస్థలో కొంతమార్పు వచ్చినపటికీ మనం యీనాటికీ చదివి అర్థం చేసుకొని ఆనందించ గలుగుతున్నాం.

పైకట్టడం ఉత్పత్తితోగానీ, ఉత్పత్తి కార్యక్రమంతోగానీ ప్రత్యక్ష సంబంధంకలిగి ఉండదు. పరోక్షంగానూ, ఆర్థిక వ్యవస్థద్వారా, పునాదిద్వారా సంబంధంకలిగి ఉంటుంది.

భాష మానవుని ఉత్పత్తి కార్యక్రమంతో ప్రత్యక్ష సంబంధం కలిగివుంటుంది. ఉత్పత్తినుంచీ పునాదివరకూ, పునాది నుంచీ పైకట్టడం వరకూగల అతని కృషియొక్క అన్నిరంగాల లోనూగల కార్యక్రమ మంతటితోనూ ప్రత్యక్షసంబంధం కలిగి ఉంటుంది. అంచేత ఉత్పత్తిలో జరిగే మార్పులను భాష తక్షణమే ప్రత్యక్షంగా ప్రతిబింబిస్తుంది. పునాదిలో మార్పు కోసం అది నిరీక్షించదు. కనుక పైకట్టడం కార్యరంగంకంటె మనిషియొక్క అన్ని కార్యరంగాలతో సంబంధంకలిగిన భాష యొక్క కార్యరంగం అతివిశాలమూ అనంతమూ అయినది.

ఉత్పత్తి రంగంలోనూ, కళాశాస్త్ర వాఙ్మయ రంగా ల్లోనూ, ఒకజాతి సాధించిన నూతనసృష్టినిబట్టి నూతనపదాలు, నూతనపరిభాష, నూతనసాంకేతిక పదాలెన్నో ఆభాషలో వచ్చిచేరుతూ వుంటాయి. ముఖ్యంగా శాస్త్రీయరంగంలో మానవుడు సాధించిన విజయాలు జాతిభాషా పరిధులకు అతీత మైనవి. ఇవి ప్రపంచంలోని వివిధభాషలను ఒకదానికొకటి సన్నిహితంగావిస్తాయి. 1. ఏజాతిమనిషి ఏశాస్త్రీయ విజ

యాన్ని సాధిస్తాడో, సాధారణంగా ఆభాష తాలూకు పదాలే సాంకేతిక పదాలుగా వివిధభాషల్లోనూ చలామణీ అవుతుంటాయి. ఉదా - ఎక్స్‌రే, మోటారు మొ॥ 2. ఒకవేళ అనువదించు కోడానికి వీలున్నప్పుడు వాటిని అనువదించుకొన్నా, ఆ మూలపరిభాష శబ్దార్థాలకు సరిపోయేట్టుగానే ఉంటాయి. ఉదా - హైడ్రోజన్ - ఉదజని మొ॥ 3. లేక ఆ శబ్దానికి సన్నిహితంగా ఉండేట్లు అక్షరానువాదం (ట్రాన్స్‌లిటరేషన్) అయి మూలపరిభాషను స్ఫురింపజేసేవిగా నయినా ఉంటాయి. ఉదా - నైట్రోజన్ - నత్రజని మొ॥.

## భాషాపరిణామం

భాష సమాజంతో పుడుతుంది. సమాజంతో అభివృద్ధి చెందుతుంది. సమాజం చచ్చిపోయినప్పుడు భాష చచ్చిపోతుంది. సమాజం లేనిదే భాషలేదు. కనుక మానవుని సమస్త కార్యాచరణతోనూ భాషకు ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. అందుచేత ఇతర సామాజిక దృగ్విషయాల మాదిరిగాగాక, సామాజికోత్పత్తిలోని నిరంతరాభి వృద్ధినీ, అవసరాన్ని అనుసరించి భాష–ముఖ్యంగా భాషలోని పదజాలం తత్క్షణం నిరంతర పరిణామానికి గురిఅవుతూ ఉంటుంది. ఆయా అవసరాల్ని బట్టి కొత్తపదాలను, పదప్రయోగాలనూ చేర్చుకొంటూ నిరర్థకమైన పాతపదాలనూ, పదప్రయోగాలనూ తొలగించుకొంటూ, వ్యాకరణ వ్యవస్థను అభివృద్ధిచేసుకొంటూ భాష నిరంతరం పురోగమిస్తూ ఉంటుంది.

అయితే, భాషలో ముఖ్యమైన మార్పులు మాత్రం ఇతర సామాజిక దృగ్విషయాలలో కంటె చాల ఆలస్యంగా

జరుగుతాయి. భాషలో ముఖ్యమైనవి దాని వ్యాకరణవ్యవస్థా, మూలపదకోశమూను. పాత లక్షణాలు గల భాష నాశనమై కొత్తలక్షణాలుగల భాష నిర్మాణం కావాలంటే అందుకు కనీసం కొన్ని శతాబ్దాలయినా పడుతుంది. నూతన స్వభావంగల భాషగా ఒకటి పరిణామం చెందాలంటే, క్రమంగా నూతన స్వభావంగల ధాతువులు ప్రత్యయాలు (ఎలిమెంట్స్) వగైరా చేరిన మీదట పాతవి క్రమంగా నశించడం ఫలితంగానే జరుగుతుంది.

సాధారణంగా ప్రతి జాతి తాలూకు భాషలోని వివిధ మాండలికాలు దానిలో లీనమై ఒకే జాతీయ భాషగా పరిణమిస్తాయి. కాని, ఆర్థికాభివృద్ధికి అవసరమైన పరిస్థితులు లేక ఇంకా ఒక సమగ్రజాతి (నేషన్) గా రూపొందని ఒకే రాజ్యంలోని ఒకే జాతి (నేషనాలిటీ) ప్రజల్లో ఒక ప్రధానభాగం వలసపోవడంవల్ల ఆ ఉభయులకు భౌగోళికమైన సాన్నిధ్యం లేకగానీ, లేక ఆ రాజ్యం కారణాంతరాలచే విచ్ఛిన్నమైపోవడం వల్లగానీ వారు ఒక జాతిగా అభివృద్ధి అయ్యే అవకాశం ఉండదు. అంచేత అప్పటికింకా ఒకే ఒక భాషలో సమ్మిళితమయ్యే సమయుంరాక నిల్చిపోయిన వారి వివిధమాండలిక భాషలు పునరుజ్జీవితాలై ప్రత్యేక స్వతంత్ర భాషలుగా తయారవుతాయి. ఇలా ఒక మూలభాష ఒకవేళ కొన్ని భాషలుగా చీలిపోయినా, ముఖ్యంగా ఆ యా భాషలకు సంబంధించిన మూలపద సముదాయం, వ్యాకరణ స్వరూపం మాత్రం అంత త్వరగా అంత హెచ్చుగా మార్పుచెందవు. యుగయుగాలుగా

శతాబ్దాలు, సహస్రాబ్దాలుగా కొద్దిమార్పులతోనిల్చిపోతాయి. విశేషించి మూలపదజాలం కంటె వ్యాకరణస్వరూపం చాల తక్కువగా చాల ఆలస్యంగా మార్పు చెందుతుంది. కనుక భాషలో పరిణామం జరగడమంటే, అది మూడు రకాలుగా జరుగుతుందన్నమాట! 1) పదకోశంలో మార్పు 2) ఆ పదకోశంలో ముఖ్యమైన మూల పద సంపదలో మార్పు. 3) వ్యాకరణ స్వరూపంలో మార్పు. ఇవి క్రమంగా ఒక దానికంటె ఒకటి చాల తక్కువగా, చాల ఆలస్యంగా జరుగుతాయి. ఒకే కుటుంబానికిచెందిన వివిధ భాషల స్వరూపస్వభావాలను సునిశితంగా పరిశీలించితే యీ విషయం విదితం కాగలదు.

నదీ ప్రవాహంలోని శిలాఖండాలు, గులకరాళ్లు మాదిరిగా యుగయుగాలుగా భాషా ప్రవాహంలో బడి కొరుమారవుతున్నా, కొంతవరకు మారిపోతున్నా ఆ యా మూల పదాలు చాలవరకు తమ సాదృశ్యాన్ని వెలువరిస్తూనేవుంటాయి. కొన్ని పదాలు, లక్షణాలు అరగి, కరగి సైకతరేణువులుగా మారి నూత్న స్వరూపాన్ని దాల్చి, నామమాత్రావశిష్టమై, ఈ సాదృశ్యాన్ని పోల్చుకోవడం కష్టసాధ్యమూ, అసాధ్యమూ కావడం, ఆ స్థానంలో కొత్త శిలా ఖండాల మాదిరిగా కొత్త మూల పదాలు వచ్చిచేరడం గూడా జరుగుతోంది. వివిధ యుగాల్లో, వివిధ ప్రాంతాల్లో, విజాతీయ సజాతీయ సంపర్కంతో విభిన్నావయవ నిర్మాణం, భిన్న సంస్కృతీ గల వివిధ ప్రజల, వ్యక్తుల ముఖాలలో అవి తమ స్వరూప స్వభావాలను, అర్థాలను ఎన్నో విధాలుగా మార్చుకోవడం జరుగుతుంది. సాధ్యమైనంతవరకు ఆ యా సజాతీయ భాషల సాదృశ్య వైదృ

శ్యాలను గుర్తించి భూగర్భంలోని ఖనిజాలమాదిరిగా త్రవ్వి యెత్తడం నేటి భాషా శాస్త్రవేత్తల కర్తవ్యమై యున్నది. అంతేగాక, ఇతరభాషల ప్రాబల్యం క్రింద ఒక భాష శతాబ్దాలు, సహస్రాబ్దాలు నలిగి, చితికి పోయినా, తన వ్యక్తిత్వాన్ని సాధారణంగా అది నిలుపుకొంటుంది. దాని మూల పదసముదాయం, వ్యాకరణవ్యవస్థా చాలవరకు నిలిచేఉంటుంది. అందుకు తెలుగు మొదలయిన మన ద్రావిడ భాషల స్థితియే నిదర్శనం. వాటి నిర్మాణం అనేక యుగాల పరిణామ ఫలితంగా పటిష్ఠం గావడమూ వాటిని ముంచెత్తిన సంస్కృత ప్రాకృతాది ఆర్యభాషల నిర్మాణంకంటె కొంత విభిన్నం గావడమూ అందుకు గల ముఖ్య కారణాలు.

## పరిణామ కారణాలు

పెద్దల వ్యవహారంవల్లనే బిడ్డలు ఆయాభాషలను నేర్చుకొంటున్నారు. ఇక భాషా విపరిణామానికి ముఖ్యంగా 1. వ్యక్తిభేదము 2. సంఘభేదమూ 3.సుఖాపేక్ష మొదలయినవి కారణమవుతున్నాయి. వ్యక్తిభేదం ఉన్నా సాన్నిధ్యంవల్ల సాదృశ్యం అధికమాతుంది. సంఘభేదంవల్ల సాదృశ్యమున్నప్పటికీ సాన్నిధ్యాభావంవల్ల విభేద మధికమవుతుంది. భవిష్యత్తులో ఈకారణం వల్ల దాక్షిణాత్యుల కందరికీ ఒక భాష, అలాగే భారతీయుల కందరికీ ఒక భాష, ఆసియాఖండ వాసులందరికీ కలిపి ఒక భాష, తదుపరి ప్రపంచ భాష ఏర్పడడాని కవకాశం ఉంది. సుఖాపేక్షవల్ల ఉత్పత్తి వగైరా కార్యక్రమాల్లో సమష్టికృషి కోసం మనుష్యులు భాషలో మార్పుచేసుకొంటూ, తగిన సం

స్కార దార్ఢ్యం పొందుతున్నారు. సంస్కార దార్ఢ్యానికి ముఖ్యంగా ఇంద్రియార్థాల జ్ఞానజనక సామర్థ్యం, వ్యక్తియొక్క గ్రహణశక్తి, ఇంద్రియార్థ సాక్షాత్కారం తరచుగా కలగడం (ఆవృత్తి) అనే మూడూ ముఖ్యకారణాలు. సాధారణంగా పెద్దవాళ్ళకంటె పిల్లలు భాషలను శీఘ్రంగా గ్రహిస్తారు. బాల్యంలో గ్రహించినది చిరకాలం నిలుస్తుంది. ఇంద్రియ పాటవం సరిగా ఉంటేనే పై విధంగా ప్రమారూపమైన యథార్థ జ్ఞానం కలుగుతుంది. సరిగాలేకుంటే భ్రమాత్మకమైన అయథార్థజ్ఞానం మాత్రమే కలుగుతుంది. అట్టి అయథార్థ జ్ఞానం వల్ల కలిగే సంస్కారంగానీ, తజ్జన్యమైన శబ్దోచ్చారణ గానీ అయథార్థాలే అవుతాయి. ఉచ్చారణలో మార్పు రావడానికిదొక కారణం.

వర్ణోచ్చారణ సాధనభూతములైన జిహ్వాద్యవయవాల స్వరూప సంయోగ వైలక్షణ్యం మరొక కారణం. లాఘవాపేక్ష ఇంకొక కారణం. ప్రస్తుత పరిస్థితి విషయంలో అసంతుష్టియే పురోగమనానికి ప్రధాన కారణం. కనుక, వ్యక్తి వ్యక్తికీ ఉచ్చారణ విషయంలో కొంత వైవిధ్య మున్నప్పటికీ, ఒకే భాషను మాటాడే సంఘంలో పరస్పరం పరివర్తనచేసుకొంటూ ఉచ్చారణలు ఒకే విధంగా మార్పుచెందుతాయి. ఇలా మారడానికి నేడు రేడియోలు, సినిమాలు, నాటకాలు, ఉపన్యాసాలు, విద్యాభ్యాసం, సారస్వతం, సంప్రదాయం, గతానుగతిక స్వభావం మొ॥ వాటి ప్రభావం చాలా హెచ్చుగా ఉంది. వీటి ద్వారా ప్రజల్లో అనుకరణం హెచ్చి సత్వర భాషా విపరిణామాన్ని అరికడుతోంది. అంతేగాక బస్సులు,

రైళ్లు, స్టీమర్లు, విమానాలు మొ॥ ప్రయాణ సౌకర్యాల ఫలితంగా వివిధ ప్రాంతాలు, దేశాలు సన్నిహిత మవుతున్నాయి. తత్ఫలితంగా వర్ణోచ్చారణలో శీఘ్రగతిని మార్పులు రాకుండా ఐకవిధ్యం సిద్ధిస్తోంది. ఇందుకు ఇంగ్లీషునే ఉదాహరణగా తీసుకోవచ్చు. అది ఇంగ్లండులోనేగాక, వివిధ ఖండాల్లోని అనేక దేశాల్లో వ్యాప్తిలో వున్నా, పై సౌకర్యాలవల్ల హెచ్చు మార్పులు పొందకుండా పరస్పరం అర్థం చేసుకోబడుతోంది. మొత్తంమీద సాన్నిధ్యం లేకపోవడమే ప్రధానంగా ఒకే భాష అనేక భాషలుగా మారడానికి కారణమవుతుంది.

జె. హెచ్. బ్రెడ్స్ డార్ఫ్ పదాల్లోని మార్పుకు ఈక్రింది కారణాలను పేర్కొన్నాడు. —

1. తప్పుగావినడం, తప్పుగా అర్థం చేసుకోవడం 2. ఒక మాట యథాస్వరూపమున స్మృతికి రాకుండా ఉండడం 3. వాగింద్రియాల్లోని దోషం 4.అలసత. భాషయందలి మార్పులకు నూటికి తొంభైవంతున ఇదియేకారణమని అతని యభిప్రాయం. 5. స్వర సామ్యమునుబట్టి కొత్తపదాల నేర్పరచడం 6. స్పష్టోచ్చారణకై ప్రయత్నం 7. నూతన భావప్రకటనా వశ్యకత ఈ కారణాల్లో కొన్నిటిని తరువాతి వారంగీకరించలేదు.

## పరిణామ సూత్రాలు

భాషాపరిణామం కొన్ని ప్రధానసూత్రాలమీద ఆధారపడే జరుగుతుంది. ఇది ముఖ్యంగా శబ్దపరిణామం అనీ, అర్థ పరిణామం అనీ రెండురకాలుగా వివరించవచ్చు.

1. అనుకరణం లేక అన్యతరాకర్షణం

ఉదా:- అంకురారోపణం - అంకురార్పణం; జ్ఞానాని, గచ్ఛామి మొ॥

2. స్పష్టప్రతిపాదనేచ్ఛ - లేక దార్ఢ్యాపాదనం

ఉదా:- క్ష్మా క్షమా మొ॥ .

3. వర్ణలోపం — ఉదా:- తామరసమ్ - తామర

4. వర్ణాగమం—— (ఉద్వృత్తాచ్చుల మధ్య 'య వ' లను చేర్చుట, స్వరభక్తి – లేక విప్రకర్షము మొ॥) ఉ:- రథః- అరదము మొ॥

5. వర్ణవ్యత్యయం—— (వర్ణములు తారుమారవడం)

ఉ:- వారాణసీ——బెనారస్ మొ॥

6. వర్ణ సమీకరణం—— సంయుక్తాక్షరములు ద్విత్వాక్షరములుగా మారుట. ఉ:- అగ్ని - అగ్గి మొ॥ సంస్కృత సంధి కార్యములు చాలవరకీ రీతివే.

7. వర్ణాదేశం—— (అచ్చుల మధ్య పరుషములకు సరళములవడం, తాలవ్యీకరణం మొ॥) ఉదా:- యమున–జమున మొ॥

స్థూలంగా ఇవి పదాలలో జరిగే మార్పుకు సంబంధించిన సూత్రాలు. ఇందులో చివరిదైన వర్ణాదేశాన్ని గురించి కొంత వివరించడం అవసరం.

# ధ్వని పరిణామ సూత్రాలు

ఒకే కుటుంబానికి సంబంధించిన ఒక మూలపదంలోని కొన్ని వర్ణాలు ఆ కుటుంబంలోని వివిధ భాషల్లోగానీ, లేక తదితర కుటుంబాలకు సంబంధించిన భాషల్లోగానీ స్థూలంగా యీ క్రింది సూత్రాల ననుసరించి మార్పుచెంది వుంటాయి. ముఖయంత్రం మానవులందరికీ ఒకే విధంగా ఉంటుంది గాబట్టి

ఈ విషయంలో సాదృశ్యం ఉండడం చాలవరకు సంభవమైంది.

1. స్థానకరణ ప్రయత్న (చూ. ఆంధ్రభాషా చరిత్ర 314 పేజీ) సామ్యమును బట్టి సదృశవర్ణములు ఆదేశములుగా రావడం.

2. సన్నిహిత స్థాన కరణ ప్రయత్నజాతములైన వర్ణములు కూడా ఆదేశములుగా రావడం కొంచెం తక్కువగా జరుగుతుంది. ఇది ముఖ్యంగా ఆ యా భాషల, శాఖల, భాషా కుటుంబాల విశిష్టతను తెలియజేస్తుంది.

3. తెలుగులో యతి నియమాని కవసరమని చెప్పిన వర్ణమైత్రి లాంటిది ఆ యా పదాల్లో ఉండే అక్షరాలకు వాటి కాదేశాలుగావచ్చే అక్షరాలకు సాధారణంగాఉంటుంది.

4. ఈక్రింది అక్షరాలు సాధారణంగా ఒకదాని బదులు మరొకటి వస్తుంటాయి.

1) ల=డ 2) ర=ల 3) ఱ=ళ=డ 4) ల=న 5) ఘ, ఝ, ధ, భ, శ, ష, స=హ 6) శ=చ=క 7) చ=క 8) య=జ=ద 9) ద=ర 10) ల+త=ట 11) ర+ద=డ 12) ర+న=ర్ణ 13) స, త వర్గ + ష, ట వర్గ=ష, ట, వర్గలు 14) స, త వర్గ+శ, చ వర్గ=శ-చ వర్గలు వెం॥

## సంస్కృతం - మూలభాష

వివిధ ఇండో-యూరపియన్ భాషలను పరిశీలించి, అన్నిట్లోగానీ, చాల వాటిల్లోగానీ ఉన్న లక్షణాలే వాటి మూలభాషలో ఉండి ఉంటాయని ఊహించి మూలభాషా స్వరూపాన్ని, దాని వర్ణ సమామ్నాయాన్ని భాషాశాస్త్రవేత్తలు నిర్ధరించియున్నారు. మూలభాషలోని వర్ణాలకూ, సంస్కృత వర్ణాలకు గల ప్రకృతి వికృతి భావాన్ని ఈ క్రింది విధంగా చూపించి యున్నారు.

| సం.=మూ. భా. | సం.=మూ. భా. | సం.=మూ. భా. |
|---|---|---|
| అ=ఎ, ఒ, మ్, న్, | చవర్గ=కంఠ్యమాధ్యమిక-క | య=జ, య. |
| ఆ=ఆ, ఏ, ఓ | వర్గ + ఇ, ఈ, ఎ, ఏ, ఐ, య | వ=వి, వ |
| ఇ=ఇ, ə (తటస్థాచ్చు) | టవర్గ=రేఫ + తవర్గ (ప్రాకృ | ర=ర, ల |
| ఈ=ఈ, ər, əl | తంద్వారా); ల + తవర్గ- | ల=ల, ర |
| ఉ=ఉ, ər, əl | 'ఫార్చునేటోవ్' సూత్రం | శ=తాలవ్యకకార, స, శ |
| ఊ=ఊ, ər, əl | ఠ=ష + త | వర్ణ సన్నిధిలోని సకార |
| ఋ=ఋ, ౠ | డ=జ(z), ద, తాలవ్యగకార, | మునుంచి |
| ౠ=ౠ=ఋ | జ + ద | ష=తాలవ్యకకార + త, స |
| ఏ=అయ్, ఎయ్, ఒయ్ | ఢ=జ(z) + ధ | స=స |
| ఐ=ఆయ్, ఏయ్, ఓయ్ | తవర్గ=తవర్గ | హ=ఘ (కం. మా. తా.), |
| ఓ=అవ్, ఎవ్, ఒవ్ | పవర్గ=పవర్గ | ధ, భ |
| ఔ=ఆవ్, ఏవ్, ఓవ్ | గ, ద, బ (వర్గతృతీయ)=ఘ, | |
| కవర్గ=కంఠ్య, మాధ్యమిక | ధ, భ- 'గ్రాస్‌మన్' | |
| కవర్గాలు | సూత్రం | |

ఈ సందర్భంలో శ్చుత్వ, ష్టుత్వ, అయవాయావాదేశాది సంస్కృత సంధికార్యాలు గమనించ దగ్గవి.

## భాషలు - పారస్పరిక ప్రభావం

వాక్యనిర్మాణంలోనూ, భావప్రకటనా విధానంలోనూ కూడా చిరకాలానుగతమైన పరభాషా సంపర్కంవల్ల కొన్ని కొత్త రీతులు ఒక భాషలో ప్రవేశిస్తాయి. ఉదా - సంస్కృత భాషాసంపర్కంవల్ల తెలుగులో కర్మణి ప్రయోగవిధానం వగైరా ప్రవేశించాయి. సమాజం ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిణామాలకు గురి అయినప్పుడు భాషలో పెక్కొలది మార్పులు రావడం మనంచూస్తూఉంటాం. అయితే,

ఈ పరిణామాలేవీ ఆయాభాషల మూలపదాలు, వ్యాకరణ వ్యవస్థ మొ॥ ప్రాథమిక స్వరూపంలో అంతహెచ్చుగా, అంత సులభంగా మార్పుతీసుకరాలేవు. ఉదాహరణకు నన్నయకాలం నాటి తెలుగుభాషయే ఆధునికాంధ్రభాషకు పునాదిగాఉంది.

సామాజిక వ్యవస్థలోవచ్చే కొత్తకొత్త మార్పులనుబట్టి కొన్ని పాతపదాలు వాటి ఉపయోగంలేక వాడుకలోనుంచి తొలగిపోతాయి. అలాగే ఉత్పత్తి సాధనాల్లోనూ, ఉత్పత్తి విధానంలోనూ,పునాదిఅయిన ఆర్థికవ్యవస్థలోనూ, పైకట్టడమైన రాజకీయ సాంఘికాది వ్యవస్థలోనూ వచ్చిన కొత్తమార్పులతో బాటు వాటిని తెలిపే కొత్తపదాలనేకం ఆయాభాషల్లో వచ్చి చేరుతుంటాయి. కొన్నిసందర్భాల్లో పాతపదాలకంటె ఎక్కువ అర్థవంతాలు కావడంవల్లగానీ, పాలకజాతి లేక వర్గం మాట్లాడే మాటలు కావడం వల్లగానీ, అందం, ఔచిత్యం, సంక్షిప్తత వగైరా గుణాలవల్లగానీ, ప్రఖ్యాతకవుల ప్రసిద్ధ ప్రయోగాలను బట్టిగానీ కొన్ని కొత్తపదాలు పాతవాటి స్థానంలో తరచుగా వాడబడుతూ ఉంటాయి. మరికొన్ని సందర్భాల్లో పాతపదాలే తమ పాతఅర్థాలు కోల్పోయి నూతన అర్థాల్లో విరివిగా చలామణీ కావడం జరుగుతుంది. అంతేగాక కొన్నిపదాల అర్థాలు ఒకదానిది మరొకదానికి సంక్రమించడం జరుగుతుంది. ఇవన్నీ సజీవభాషకు సహజమైన గుణాలు. అభివృద్ధికి లేక పతనానికి సూచనలు. సజీవభాషలు జీవనదులవంటివి. మహానదులలో ఉపనదులుచేరి ప్రవాహాన్ని విస్తృత పర్చినట్లు ఇతరభాషా

సంపర్కంవల్ల సాధారణంగా వివిధభాషలు అభివృద్ధి చెందు తాయి. విజేతృ భాషలసంగతి ఇక చెప్పనవసరంలేదు.

మొత్తంమీద భాష యావత్తునూ దృష్టిలోపెట్టుకొన్న ప్పుడు, ఈ పై మార్పులన్నీ పైపై మార్పులు గానే తోస్తాయి. భాషలోని మూలపదాల్లోనూ, వ్యాకరణ నిర్మాణంలోనూ, వ్యాకరణ విధానంలోనూ, కేవల ఆర్థిక రాజకీయ సాంఘిక సాంస్కృతికాది వ్యవస్థల్లో వచ్చేమార్పులనుబట్టి అంతత్వరితంగా అంత పెద్దమార్పులు రావనేది చరిత్రప్రసిద్ధమైన నగ్నసత్యం. ఉదా:- ద్రావిడ భాషలు ఆర్యభాషా సంపర్కంవల్ల అనేక నూతన పదాలను చేర్చుకొన్నప్పటికీ, తమ వ్యాకరణ స్వరూ పంలో కొన్ని మార్పులు చేసుకొన్నప్పటికీ, తమ ప్రత్యేకతను ఇప్పటికీ నిలుపుకొనే ఉన్నాయి. తమ ప్రభావాన్ని సైతం ఆర్య భాషలపై ఎన్నోరకాల ప్రసరింప జేయ గల్గాయి. ఆర్యభాష ల్లో మూర్ధన్యాక్షర ప్రాచుర్యం మొ॥ వీందు కుదాహరణ. తగి నంత సంఖ్యాబలం, నాగరికతాస్థాయి, భాషలపరిపక్వత-అన్ని టికి మించి కొద్దిమంది ఉన్నప్పటికీ తమ తెగను, తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని, జాతీయతను సంరక్షించుకోవాలనే పట్టుదల కూడా పరజాతుల-పరభాషల దాడినుంచి తట్టుకొని భాషలు తమ వ్యక్తిత్వం నిల్పుకోగలగడానికి ముఖ్యకారణాలవుతాయి. మొత్తంమీద ఉత్తర హిందూస్థానంలో ఆర్యభాషలూ, దక్షిణ హిందూస్థానంలో ద్రావిడభాషలూ సహస్రాబ్దాల సంఘర్షణ పిమ్మట ప్రాబల్యం వహించడాని కివే కారణాలయి ఉంటాయి. పరస్పరం పదజాలాన్ని వ్యాకరణ రీతుల్ని పలురకాలుగా

మార్పుకొని అభివృద్ధి చెందాయి. దేశ్యాలపేరుతో పై రెండు రకాల భాషల్లోనూ కన్పించే పదజాలంలో చాలభాగం ఆదిమ నివాసుల, ద్రావిడులభాషలకు సంబంధించినదే అయివుంటుంది.

## అర్థ పరిణామం - శబ్దార్థశాస్త్రం (Semantics)

భాష మారుతుందీ అంటే—భాషలో వున్న శబ్దమూ, అర్థమూ కూడా కొన్ని పరిమితులకు లోబడి మారుతున్నాయన్న మాట! పదార్థానికి పదంతో వుండే సంబంధం శక్తి అనీ, మానవేచ్ఛయే శక్తి అనీ భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అది సహజమూ, సంకేతితమూ కూడా. పశు దశలో మనుషులు తమ తమ ఆలోచనల్నీ, అభిప్రాయాల్నీ, వాంఛలనూ కొన్ని ధ్వనులతోటీ లేక శబ్దాల (పదాల) తోటీ తెలుపుకొంటుండేవాళ్లు. చేష్టలను వాటికి సహాయంగా మాత్రమే ఉపయోగిస్తూ ఉండేవాళ్లు. తమ చుట్టూ ఉండే పశుపక్ష్యాదుల శబ్దాలను-అంభా, మే, కూకూ మొ॥ వాటిని అనుకరించి వాటి రూపాల్ని ఊహించుకొంటుండేవాళ్లు. ఇలా సాధారణమైన ధ్వనులనుండే సంశ్లిష్టమైన వివిధధ్వనులూ పుట్టుకొచ్చాయి. ఆ ధ్వనులే ఆ యా పశుపక్ష్యాదులకు పేర్లుగామారిపోయాయి. ఉదాహరణ—ఆవు, మేక, కోకిల మొ॥

అంతేగాక మనుష్యుల్లో సహజంగా కలిగే వివిధ వాంఛలూ, భావాలకు అనుగుణంగా అనేకరకాల అనుభావాలు కలుగుతాయి. అందులో హాహా, ఓహో మొ॥ శబ్దాలు వస్తుంటాయి. ఆ శబ్దాలనుబట్టి వాటికి కారణమైన భావాలను తెలుసుకుంటాము. భావబోధకాలైన శబ్దాలు, కొన్ని ఆశ్చర్యార్థ

కాలు ఇలాగే పుట్టాయి. ఉదా– హాయి మొ॥ ప్రపంచంలోని అనేక భాషల్లో ఆశ్చర్యాద్యర్థకాలు కొన్ని ఇంచుమించు సమానంగా ఉండడానికిదే కారణం.

ఏ భాషలోనైనా ఒక ప్రధానభాగం ధ్వన్యనుకరణాల నుంచే ఉత్పన్న మవుతుంది. వినికిడిలో అన్ని జాతులూ కుడి ఎడంగా సమానంగానే ఉంటాయి. కాబట్టి, అలాంటి పద సముదాయం కూడా ఇంచుమించు సమానంగానే ఉంటుంది. ఇందులో 1) ఆశ్చర్యాద్యర్థకాలు 2) పశుపక్ష్యాదుల కూతలు– వాటినిబట్టి కోకిల, కాకి మొ॥ వాటిపేర్లు. 3) ధ్వనితో కూడిన కొన్ని క్రియలు (కట్ మొ॥) 4) ధ్వన్యనుకరణాలు 5) ధ్వనితో కూడిన పనిముట్లు, ఆయుధాలు (తుపాకి మొ॥) మొ॥ చేరి వుంటాయి. అంతేగాక పేర్లుపెట్టడంలో ఆ యా వస్తువుల స్వరూపం, సాదృశ్యం, అవి చేసే పనులు వాటి ఉపయోగం వగైరా కూడా హెచ్చుగా పనిచేస్తాయి. 'అంబ, అంబా' అనే పదాలు ఎక్కువ భాషల్లో కన్పించడానికిదే కారణం. ఆవు మొ॥ కొన్ని పశుపక్ష్యాదుల్లో సయితం యీ పదాలు విన్పిస్తాయి. ఇలాంటి పదాల్లో అంతర్జాతీయ భాషా లక్షణాలుండడంవల్ల కొన్ని ఆధునిక వైజ్ఞానిక పారిభాషిక పదాలు మాదిరిగా ఇవి ముందేర్పడబోయే ప్రపంచభాషకు మూలపదాలుగా భావించవచ్చు. మొత్తంమీద హావభావాలతో కూడిన యీ ప్రాథమిక ధ్వనులూ లేక పదాలే మనుష్యుల్ని పశుపక్ష్యాదులనుండి వేరు చేశాయి. మనుష్యులు తెగలుగాచేరి ప్రకృతితో పోరాడి అభివృద్ధి కావడానికి తోడ్పడ్డాయి.

సహజ సంబంధాన్ని అనుసరించిన పై మాటలను బట్టి మరి కొన్నింటిని మానవులు స్వయంగా కల్పించుకొన్నారు. కల్పనలో తేడాలుండడాని కవకాశం ఉంటుంది గాబట్టి ఈ విధంగా వివిధ తెగల భాషలు విభిన్న రీతుల్లోనూ, రూపా ల్లోనూ అభివృద్ధి చెందాయి.

కాలక్రమేణ శబ్దంలో మాదిరిగానే అర్థంలోగూడా ప్రకృతి వికృతులకు కొన్నిటికి చాలాభేదం ఏర్పడింది. శబ్దార్థాల సంబంధం చాలవరకు సంకేతితం కావడంవల్ల చదువుకొనని సామాన్య ప్రజల్లో యీ సంకేతాలు వ్యాప్తినొందక పోవడం వల్ల అవిద్య, అజ్ఞానం మొ॥ నవి శబ్దార్థ విపరిణామానికి కారణం అని చెప్పవచ్చు.

అంతేగాక సాధారణ ప్రజలు అత్యల్పభేదాలను పరిగ ణించక, సన్నిహితార్థములందు ఆయా పదాలను ప్రయో గించడం జరుగుతుంది. అంచేత మొదటి అర్థానికి సన్నిహితమైన అర్థంలో ఒకపదాన్ని ఒకరు ప్రయోగిస్తే, దానికి సన్నిహితమైన అర్థంలో ఆశబ్దాన్ని మరొకరు ప్రయోగించవచ్చు. ఈవిధంగా మొదటి అర్థానికి తరువాతి అర్థాలకు చాలాదూరమేర్పడవచ్చు. కాని, అర్థాలకుండే ఈసాన్నిధ్యం అనేక సంబంధాలలో నియ మితమైయే ఉంటుంది.

1. సామాన్య విశేషభావం 2. కార్యకారణభావం 3. అవయ వావయవి భావం 4. సామీప్యం 5. సాదృశ్యం 6. తాద్ధర్మ్యం 7. తాదర్థ్యం 8. వైపరీత్యం మొ॥.

ఈవిధంగా వాచ్యార్థాలకు సన్నిహితములూ, సంబద్ధ ములూ అయిన అర్థాల్లో ఆయాపదాలను ప్రయోగించడంవల్ల

ఒక్కొక్క పదానికి అనేకార్థాలు ఏర్పడుతున్నాయి. అలాగే అసంబద్ధార్థములైన రెండు విభిన్న శబ్దాలు వర్ణవిపరిణామ వశాన ఒక్కొక్కప్పుడు అభిన్నములు కావచ్చు.

## ప్రజలు - పండితులు

సాధారణంగా నూతనభాషలేవైనా సాధారణ ప్రజల వ్యవహార భాషల నుంచే పుడుతూ ఉంటాయి. పండితులు, కవులు ఆ భాషలలో కావ్యాలు వ్రాసి, వాటిని వ్యాకరించి సారస్వత భాషలుగా చేయడంతో కొంతమార్పు తీసుకొస్తాంటారు. చాలవరకది భాష స్థిరత్వానికి తోడ్పడుతుంది. కాని, ఆమార్పు ఆయాయుగాల ప్రజా వ్యవహారాని కనుగుణంగా లేకపోతే, వ్యతిరేకంగానూ మరీ కృతకంగానూఉంటే, కొన్నాళ్లకది శతాబ్దాలుగా సాగే సాధారణ ప్రజల వ్యవహార ప్రవాహంముందు నిలువజాలదు. ఇందుకు నేటి మనగ్రాంథిక వ్యావహారిక భాషా వైరుధ్యమే తార్కాణ. పండితులు, కవులు కొన్ని కొత్త మాటలనుకూడా కల్పిస్తూ ఉంటారు. ఆ కల్పన కూడా ప్రజాభాష ననుసరించే ఉంటుంది. కాని, మొత్తంమీద భాషలో హెచ్చుభాగం, లేక ప్రాథమికస్వరూపం వివిధఉత్పత్తి రంగాల్లో పాల్గొనే సాధారణ ప్రజలచేతనే సృష్టించబడుతోంది. ఆయారంగాల్లోని మొనగాండ్రిందుకు విశేషదోహదం చేస్తుంటారు. సాధారణ ప్రజలవ్యవహారం తెలియనిదే పండితులు నిజమైన పండితులు కాజాలరు. పండితులు, రచయితలు నిర్మాతలు, నాయకులు లేనిదే సాధారణప్రజలు త్వరత్వరగా ముందు కడుగిడ జాలరు.

# లిపి పరిణామం

నేడు ప్రపంచంలో అనేక భాషలున్నట్లే అనేక లిపులున్నాయి. ఇవన్నీ ఇప్పటి రూపుననే హఠాత్తుగా పుట్టినవి కావు. ఆ యా భాషలు పుట్టినప్పుడే పుట్టినవీ కావు. అవి పుట్టిన కొంతకాలానికి, కొన్ని మూల లిపులనుంచి లేక ఒక మూల లిపి నుంచి పుట్టి, అనేక మార్పులు చేర్పులతో కాల క్రమేణ పరిణామం చెందినట్టివే.

ప్రథమంలో ప్రాచీనులు తమ అభిప్రాయాలు దేశకాల విప్రకృష్టులైనవారికి బోధించడాని కవలంబించిన సాధనాలనుంచి యీ లిపులు పరిణమించాయి. ఆ సాధనాలు ప్రధానంగా 1) చిత్రలేఖనం 2) గ్రంధిలిపి లేక 'క్విపు' అనే సాంకేతిక పద్ధతి. అంటే, ఒక పెద్ద త్రాటికి వివిధ వర్ణాలు గల చిన్న దారాలను అభిప్రాయానుసారంగా ఆ యా స్థానాల్లో, ఆ యా సంఖ్యల్లో ముళ్లు వేసే పద్ధతి.

చిత్రలేఖనం ద్వారా రూపవత్పదార్థాలూ, వాటితో గూడిన అభిప్రాయాలూ మాత్రమే బోధించబడుతుండేవి. 'గ్రంథిలిపి' ద్వారా రూపసహిత, రూపరహిత పదార్థాలు రెండూ బోధించబడవచ్చు. మొదటిది అన్ని దేశాలవారికీ, అన్ని భాషలవారికీ అర్థమవుతుంది. కాని, అనేకు లనేక విధాలుగా కూడా అర్థంచేసుకోడాని కవకాశముంది. రెండవది కేవల్ల సాంకేతిక మగుటచే, అలా సంకేత మేర్పచుకొన్నవారికి మాత్రమే బోధ పడుతుంది. ఇది చీనాలోనూ, దక్షిణ అమెరికాలోనూ వ్యవహారంలో ఉండేది. మొత్తంమీద యీ రెండు

పద్ధతులూ వాక్యార్థ (అభిప్రాయ) బోధకాలేగాని, పదార్థ బోధకాలుగాని, పద బోధకాలుగానీ ఏకాజక్షర బోధకాలు గానీ, వర్ణ బోధకాలు గానీ కానేరవు.

మొదట్లో చీనా, ఈజిప్టు, సుమేరియా మొ॥ దేశాల్లో పుట్టిన పదార్థ బోధక చిత్రాత్మక లిపి, ప్రథమంలో పదార్థాల్ని పోలి తద్బోధకమే అయినా, అలసత మొ॥ కారణాల వల్ల కాలక్రమాన అలా పోలియుండక సాంకేతిక మయింది. అందుచేత అది పదార్థ సంబంధాన్ని వదిలి పద సంబంధాన్ని పొంది క్రమంగా పదబోధక లిపిగా పరిణమించింది. ఇది ముందు అనేకార్థక పదాలతో ప్రారంభమై ముఖ్యార్థానికి సంబంధించిన చిత్రమే విశేషార్థ సూచకాలైన కొన్ని రేఖలు చేర్చి గౌణార్థాలకు కూడా వాడబడుతూ, క్రమంగా ఆ విశేషార్థాలను ప్రకరణాదులకు వదలడంతో పదానికొక లిపి చొ॥ ఏర్పడింది. ఏకార్థకములైన అనేక పదాలకుకూడా యీ విధంగానే ఒకే లిపి ఏర్పడింది. ఏకాచ్క పదాలతో కూడిన చీనా భాష ఇప్పటివరకూ ఈ స్థితి (పదలిపి) లోనే ఉంది.

ప్రత్యయవిశిష్టమైన ఈజిప్టు దేశపుభాషలో సమాన ప్రాతిపదికములైన అనేక పదాలకు అనేక లిపు లేర్పడడం వ్యర్థమని గ్రహించడంవల్ల ప్రాతిపదిక కొక లిపి, ఏక వర్ణాత్మకమైన ప్రత్యయాలకు వేరు వేరు లిపులూ ఏర్పడి, కాలక్రమేణ వర్ణబోధకమైన లిపి మూల పదాలకు కూడా ఉపయోగించ బడింది.

ఈ విధంగా ఈజిప్టులో మొదట ఏర్పడ్డదని భావించ బడుతోన్న ఈ వర్ణబోధక లిపి సెమైట్లద్వారా అరేబియాకును,

అక్కడినుంచి వర్తకుల ద్వారా వివిధ దేశాలకు వ్యాపించిందని తెలుస్తోంది. ఈ విధంగా ఈజిప్టులో 'హీరాగ్లిఫిక్' లేక గురులిపి, సుమేరియాలో కునిఫారం (కోణరూప) లిపి ఉండేవి. నవశిలా యుగానికి పూర్వమే ఇవి ఉన్నట్లుకూడా ఆధారాలున్నాయి. ఈ రెండు లిపుల సమ్మేళన ఫలితంగానే నేటి యూరపు భాషలకు వాడే రోమన్ లిపి, తజ్జన్య లిపులూ ఏర్పడ్డాయి.

సెమిటిక్ దేశంలో ఆర్మియన్ అనీ, ఫోనీషియన్ అనే రెండు లిపులు ఉండేవి. వీటినుంచే వరుసగా అశోక శాసనాల్లోని 'ఖరోష్ఠీ, బ్రాహ్మీ' లిపులు పుట్టాయి. క్రీ. పూ. 8-వ శతాబ్దంలో భారతీయు లీ లిపులు నేర్చియుంటారని ఊహ. ఖరోష్ఠీ ఇతర సెమిటిక్ లిపులవలె కుడినుంచి ఎడమకు వ్రాయబడేది. ఉర్దూ, అరబిక్, పర్షియన్ వగైరా భాషల లిపులు దీనినుంచే పుట్టాయి. బ్రాహ్మీలిపికూడా మొదట్లో అలాగే ఉండి పిమ్మట ఎడమనుంచి కుడికి వ్రాయడం అశోకుని కాలంలో ప్రారంభమైనది. ఉత్తర హిందూస్థానంలోని బ్రాహ్మీలిపి నుండి దేవనాగర లిపి, తజ్జన్యములైన తదితర ఉత్తర భారతీయ లిపులూ, దక్షిణ భారతంలోని 'బ్రాహ్మీ' నుండి తెలుగు మొ॥ దక్షిణ లిపులు పుట్టాయని తెలుస్తోంది. తాటాకుల మీద గంటంతో వ్రాయడానికి వీలుగా తెలుగు కన్నడ లిపులు గుండ్రకత్తుగా మారాయి. తమిళలిపిలో మాత్రం కొంత విశిష్టత ఉంది. అరవంలోకంటె తెలుగులో అక్షరాలెక్కువగా ఉండడానికి కారణం అందులో సంస్కృతపదా లెక్కువగా చేరడమే!

మెక్సికో, పెరూ మొ॥ దేశాల్లో వెనుక మయులిపి ఉండేది. అది ఇంకా అర్థం చేసుకోబడలేదు. చైనా లిపి నేటికీ పైనుండి క్రిందికి పంక్తులుగా వ్రాయబడుతూంది. పేజీలు కుడి నుండి ప్రారంభమై ఎడమకు ముగుస్తాయి. చైనాలిపిలో ప్రజా చైనాప్రభుత్వం మార్పులు తలపెట్టినట్లు లిపిసంఖ్యను800కు తగ్గించడం, రోమకలిపిలో ఆభాషను వ్రాయడం మొ॥ చేసి వయోజనవిద్యను ప్రోత్సహిస్తున్నట్లు తెలుస్తోంది.

అక్షరాలు దాదాపు ఒకటిగా ఉన్నందున వివిధరోమక (ల్యాటిన్) లిపులకు ఏక రోమక లిపి, వివిధ భారతీయ (బ్రాహ్మీజన్య) లిపులకు ఏక భారతీయ లిపి, వివిధ సెమిటిక్ లిపులకు ఏక సెమిటిక్ లిపి యీవిధంగా అచ్చు,టైపు వగైరాలకు సులభమయ్యే విధంగా సంస్కరించడం అవసరం. అటుపిమ్మట ప్రపంచ భాషలన్నిటికీగూడా ఒకలిపి ఉండడం సాధ్యపడుతుంది. ఇప్పటికీ కొన్ని భాషలకు అసలు లిపులే లేకపోవడం, చాల లిపులు పైయాంత్రిక సౌకర్యాలకు అనుగుణంగా లేక పోవడం గమనించవలసి ఉన్నది. వివిధ రోమక, సెమిటిక్ లిపులకు 20-33 అక్షరాలునూ, వివిధ భారతీయ లిపులకూ 36-56 అక్షరాలునూ చైనాలిపికి కొన్ని (8-20) వేల పదలిపులునూ ఉన్నాయి. కనుక, పై రెండు సంస్కరణలకు మునుముందుగా ఆయా భాషలకు లిపులను అచ్చు, టైపు వగైరాలకు వీలుగా ఉండేటట్లు సంస్కరించడం తక్షణకర్తవ్యం.

## వర్గసమాజాలు-భాషలు

బానిస, జమీందారీ, పెట్టుబడిదారీ యుగాల్లో భాష

సాంకర్యం విరివిగా జరిగింది. విజేతల భాషలు పరాజితుల భాషలను అణచివేయడం ప్రపంచంలో అనేక దేశాల్లో పలుమారులు జరిగింది. ఇప్పటికీ పెట్టుబడిదారీ దేశాల్లో యీ విధానం యింకా కొనసాగుతోంది. పరాజితుల భాషలనుండి విజేతల భాషలు ఎంతో పదసముదాయాన్ని చేర్చుకొని ఇంకా అభివృద్ధికావడం, అలాగే పరాజితుల భాషలు విజేతృభాషా లక్షణాలను వాటి పదసంపదను ఉభయభాషల బలాబలాలను బట్టి తమలో చేర్చుకొని, కొన్ని కొంతవరకూ, మరికొన్ని గుర్తు పట్టలేనంతగానూ మారిపోవడం జరిగింది. ద్రావిడ భాషలు వగైరా ఇందుకుదాహరణ. ద్రావిడ భాషలు ప్రాచీనములూ, పటిష్టములూ కావడంవల్ల అవి తమ ప్రాథమిక స్వరూపాన్ని సంరక్షించుకో గలిగాయి. కొన్ని బలహీనభాషలు ఈ సంఘర్షణకు తట్టుకోలేక పూర్తిగా మఱుగుపడిపోవడం జరిగింది. మరికొన్ని తెగలతోబాటు వారి భాషలు కూడా తమకన్నా ప్రబలములైన తెగల్లోనూ, వారి భాషల్లోనూ లీనంకావడం జరిగింది. అలాంటి వారి శాఖల, గోత్రాల పేర్లను బట్టీ, వారి సనాతనాచార సంప్రదాయాలను బట్టి మాత్రమే వారి అసలు తెగలను భాషలను గుర్తించగలం. అంతేగాక ఒకే జాతికి సంబంధించిన వివిధ మాండలికాలలో బలీయమైన మాండలికమే ఆ జాతికి సంబంధించిన జాతీయభాషగా రూపొందడం జరుగుతుంది. కీవ్-ఒడెస్సా ప్రాంతపు మాండలికమే రష్యన్ భాషగా రూపొందడం వగైరా ఇందుకుదాహరణలు. రష్యాలోని వివిధ భాషలతో పలుమార్లు రష్యన్ భాష సాంకర్యం చెందినప్పటికీ రష్యన్ భాషయే విజయాన్ని గాంచింది. మిగతావి ఓడి పోయాయి.

ఇక మన తెలుగు విషయంలో—రాయలసీమ, తెలంగాణా, ఉత్తరకోస్తా, దక్షిణకోస్తా ప్రాంతాల ప్రజల భాషలో యాసలోనూ, పదజాలంలోనూ కొంత భేదం ఉన్నప్పటికీ పరస్పరం అర్థంచేసుకోడానికి అభ్యంతరం కలగడంలేదు. కారణం ఈ భేదం శతాంశం మాత్రమే కావడం, మిగతా పదాలూ, వ్యాకరణవ్యవస్థా ఉమ్మడి భాషనుంచి ఉపయోగించుకోవడమే. సర్కారుప్రాంతాల తెలుగులో సంస్కృతాంగ్ల ఒరియాపదాలు, తెలంగాణా తెలుగులో ఉర్దూ పదాలూ, రాయలసీమ తెలుగులో కన్నడ, తమిళ పదాలూ కొంచెం హెచ్చుగాఉంటాయి. అయినప్పటికీ నేను మన 'విశాలాంధ్ర' లో కార్మిక ప్రజాతంత్ర సంస్థలకు ప్రాబల్యం ఉండడంవల్ల మామూలుగా భూస్వామ్య పెట్టుబడిదారీ సమాజాల్లో కొన్ని మాండలికాలపట్ల చూపబడే నిర్లక్ష్య భావానికీ, అనాదరణకూ తావుండదు. పైపెచ్చు అన్ని మాండలికాల నుంచీ పుష్టినొందిన ఏకైక జాతీయ భాష విశాలాంధ్ర భాషగా వర్ధిల్ల గలదు.

## సోషలిస్టు వ్యవస్థ - భాషలు - ప్రపంచభాష

అలాగే దాక్షిణాత్య-ఔత్తరాహ భాషలనుంచీ ఏకైక భారత జాతీయభాష, వివిధ దేశీయ భాషలనుంచీ, ఆసియా ఖండ భాష, వివిధ ఖండాలభాషలనుంచీ ఏకైక ప్రపంచ భాష ఏలక్షణాలతో ఏర్పడడానికి వీలుందో ఈ క్రింది అంశాలు స్పష్టం చేస్తాయి.

ప్రపంచ మంతటా సోషలిస్టు వ్యవస్థ ఏర్పడేటప్పటికీ వివిధ జాతుల భాషలు పై పునాదులమీద పరభాషలపెత్తనం

(దాస్యం) లేకుండా పూర్తిగా వికసించి అభివృద్ధి గాంచుతాయి. అప్పుడు వివిధ రంగాల్లో వివిధ జాతుల పరస్పర సంబంధాలు, సహకారాలద్వారా వివిధ జాతుల, భాషల పలుకుబడి, భాగ స్వామ్యంగల, వివిధ భాషల్లోని ఉత్తమ గుణాలతో కూడిన జోనల్-భాషలు ముందుగానూ, పిమ్మట ఆ జోనల్ భాషల ద్వారా వాటి ఉత్తమ గుణాలతో కూడిన ఉమ్మడి ప్రపంచ భాష ఒకటి ఏర్పడడానికి అవకాశం కలుగుతుంది. ఈ విష యంలో కామ్రేడ్ స్టాలిన్ చేసిన యీ క్రింది ఉపదేశం గమ నించవలసి యుంటుంది—

"జాతీయ సంస్కృతుల, జాతీయ భాషల సంపూర్ణాభి వృద్ధి పెట్టుబడిదారీ విధానపు జాతీయపీడన రద్దునుంచి ఉదయి స్తున్న ప్రప్రథమ కర్తవ్యం. అది శాశ్వతమైన విశ్వజనీన మైన మానవ సంస్కృతికీ, మానవ భాషకూ పునాదిని ఏర్పరచ గలదు.

సోషలిజం ఎప్పుడు వివిధ జాతుల జీవితంలో భాగ మవుతుందో, ఎప్పుడయితే ఆచరణ భిన్నజాతీయ భాషలమీద ఒక సాధారణ భాష ఉంటే మేలని ఆ జాతులు విశ్వసిస్తాయో అప్పుడు ఈ జాతీయ విభేదాలు, జాతీయభాషలూ నశించి పోవడం ప్రారంభిస్తాయి. సర్వజాతి సాధారణమైన ఒకే ఒక ప్రపంచ భాషకు అవకాశం కలిగిస్తాయి."— అలాంటి భాష రూపొందడంలో ఈ క్రింది ప్రధానాంశాలు ప్రాముఖ్యత వహించవచ్చు.

1) ముఖ్యంగా ఆ యా భాషలు మాట్లాడే జాతుల జన సంఖ్య. 2) ఆ యా భాషల వ్యాప్తి. 3) ఆర్థిక రాజకీయ

పారిశ్రామిక సాంఘిక సాంస్కృతికాది రంగాల్లో ఆ యా జాతులు ఆ యా యుగాల్లో వహించిన, వహిస్తోన్న పాత్ర. 4) విశ్వసాహిత్యానికీ, సంస్కృతికి ఆ యా జాతులు, భాషలు కావించిన కృషి. 5) నూతన వైజ్ఞానిక విషయావిష్కరణ. 6) ఆ యా భాషల పరివర్త్యత, పదవిస్తృతి. 7) ఆ యా భాషా కుటుంబాల్లోనూ, జోనల్ భాషల్లోనూగల మూలపదసాదృశ్యం 8) వ్యాకరణ సౌలభ్యం. 9) శాస్త్రీయ సమన్వయ దృష్టి. 10) ఆ నాటి వివిధ ప్రపంచవ్యవహారాల ఆవశ్యకత. 11) వివిధ జాతుల మధ్య ఆర్థిక రాజకీయ సాంఘిక సాంస్కృతిక రంగాల్లో ఇప్పటినుంచీ జరిగే పరస్పర సంబంధాలు, సహకారాల విశిష్టత మొ॥.

## సమాన పదకోశాలు

సమాన (అర్థసామ్యమూ, ధ్వనిసామ్యమూ గల) పదాలతో గూడిన ఒక్కొక్క భాషా కుటుంబంలోని భాషలకు సంబంధించిన సమాన పదకోశాలు నేడు మనకు భాషల సత్వరాధ్యయనానికీ, పారిభాషిక పదజాలానికీ, భాషాశాస్త్ర పరిశోధనకూ ఉపయోగిస్తాయి. అంతే గాక, సోదరజాతి ప్రజలమధ్య సౌహార్దాన్ని నెలకొల్పడానికి గూడా ఇవి యెంతో ఉపకరిస్తాయి. అంతర్జాతీయతాభివృద్ధికి దోహదం చేస్తాయి. అవి స్థూలంగా యీ క్రిందివిధంగా తయారు చేయవచ్చు.

1. ఇండో-యూరపియన్ భాషాకుటుంబానికి సంబంధించిన వివిధ ముఖ్యశాఖలకూ ఒక్కొక్క దాని కొక్కొక్కటీ, పిమ్మట అన్నిటికీ కలిపి ఒకటి.

2. సెమిటిక్ భాషాకుటుంబానికి చెందిన భాషలన్నిటికీ కలిపి ఒకటి.

3. హామిటిక్ భాషల కోశటి.

4. తురేనియన్ భాషాకుటుంబంలోని వివిధ వర్గాలకు ఒక్కొక్కదాని కొక్కొక్కటి చొ॥.

మొత్తంమీద ఇలాంటి వర్గీకరణతో ఆ యా కుటుంబాలకూ, శాఖలకూ, వేరువేరుగా సమాన పదకోశాలను ప్రకటించడం చాలవరకు ఉపయోగిస్తుంది. భాషాధ్యయనంలో ఒక కొత్త అధ్యాయం తెరుస్తుంది. భాషాశాస్త్రవేత్తల కృషిని యీ విధమైన కృషి కొత్త పుంతల్ని పట్టించడమే గాక, వివిధ ప్రపంచ భాషల సత్వరాభివృద్ధికీ, సత్సంబంధాలకూ మధ్య దశగా ఆ యా ప్రాంతీయ (జోనల్) భాషల ఆవిర్భావానికీ తదుపరి ఏకైక ప్రపంచభాషా ఆవిర్భావానికీ దోహదమిస్తుంది.

ఒకే కుటుంబంలోని భాషల సాజాత్యాన్ని నిర్ధరించడానికి, నిత్యజీవితానికి అత్యావశ్యకమైన సర్వనామాది విషయాల అనుక్రమంలో యీ పదకోశాలు కూర్చడం మంచిది. భాషలను అధ్యయనం చేయడానికి కూడా ఈ వరుసా, ఈ పద్ధతియే ముఖ్యమైనది. ఇలాంటి పదకోశపద్ధతివల్ల కాలం, శ్రమ కలిసి వస్తాయి. పరస్పరసంబంధం ఆయా పదాలకు ఉండడంవల్ల గుర్తు పట్టడానికీ, ఉపయోగపెట్టుకోడానికీ అవి వెంటనే లొంగుతాయి.

నిపాతపద్ధతి అంతగా లేకుండా, వ్యుత్పత్తి పద్ధతిలో మౌలిక వ్యవహారానికిగాను పై విధంగా ఆ యా కుటుంబాలకు, శాఖలకు, వర్గాలకు ఒక్కొక్కదానికి 1, 2 వేల మూలపదా

లతో ఒక్కొక్క పదకోశం ప్రచురించడం అవసరం. బేసిక్ ఇంగ్లీషులో ఉన్న 800 పదాలతో నేడు ఎన్నో వ్యవహారాలు చక్కబెట్టుకొంటున్నాం. అలాగే వివిధ విషయాలలో పరిమిత మూల పదాలతోగూడిన యీ పదకోశాలవల్ల కొన్ని వేల సంవత్సరాలకు పూర్వం వ్యవహారంలో ఉన్న ఆ యా మూల భాషల స్వరూపం, పరిమితి, ఆ భాషలు మాట్లాడే పూర్వీకుల వైజ్ఞానిక స్థాయి, సాంఘిక పరిస్థితి వగైరా అర్థం చేసుకోగలగ డమే గాక నేడు మనం ఆ యా భాషల్లో సులభంగా వ్యవహ రించ గలుగుతాం. అంతేగాక, ఆయా జాతీయభాషలు చక్కగా వికసించి ప్రజలలో సత్వరవ్యాప్తి గాంచడానికి, కేవలం కృత కంగా గాకుండా, సజీవంగా ఆయా జాతీయ భాషలనుంచి పైన వివరించిన విధంగా వివిధ ప్రాంతీయ భాషలు, వాటినుంచి ప్రపంచభాష ఉద్భవించడానికి వివిధ జాతిప్రజల వివిధ సంబంధా లతోపాటు యీ పదకోశాలు ఉపయోగిస్తాయి. కనుక, అలాంటి ప్రపంచభాష స్టాలిన్ చెప్పినట్లు కేవలం రష్యన్, ఇంగ్లీషు-జర్మన్, స్పానిష్, హిందీ-సంస్కృతం, చైనీస్ మొ॥ భాషల్లో ఏఒక్కదానితోనో గాక ఆయా భాషల మూలపదాలు, ఉత్తమ లక్షణాలతోగూడి, ప్రపంచప్రజల వ్యవహార ఫలితంగా ఏర్పడు తుంది. 'ఆర్య, ద్రావిడ భాషామూలపదాలను' విడివిడిగా పాఠ కుల ఉపయోగార్థమై త్వరలో ప్రచురిస్తాను.

భాషాశాస్త్ర కోణంనుంచి చరిత్రను వ్యాఖ్యానిస్తూ యీ రచన చేశాను. ఇందుకు తోడ్పడిన మిత్రులకివే నా అభివందనాలు! ఇందలి గుణాలను గ్రహిస్తూ, సానుభూతితో చేసే సూచనల్ని హృదయపూర్వకంగా స్వీకరిస్తాను!

# ఆధారాలు (SOURCES)


| | గ్రంథం పేరు | రచయిత—లేక ప్రచురణకర్త |
|---|---|---|
| 1. | Concerning Marxism in Linguistics | J. V. Stalin |
| 2. | జాతుల సమస్య | ,, |
| 3. | భాషా సమస్య | పండిత జవహర్‌లాల్ నెహ్రూ |
| 4. | ప్రపంచ చరిత్ర | ,, ,, |
| 5. | భాషాశాస్త్ర సంగ్రహః | శ్రీ తి. గు. వరదాచార్యాః M.A.(Hons) |
| 6. | ఆంధ్ర భాషా చరిత్ర 1, 2 భాగాలు | డా. చిలుకూరి నారాయణరావు ఎం. ఏ., పి. హెచ్. డి. |
| 7. | సంధి | కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ. |
| 8. | ఆంధ్ర భాషా వికాసం | గంటి జోగి సోమయాజులు, ఎం. ఏ. |
| 9. | ఆంధ్ర ధాతుమాల | పరవస్తు చిన్నయ సూరి |
| 10. | English Idioms and How to use them | W. Mc. Mordic, M.A. |
| 11. | సిద్ధాంత కౌముదీ | భట్టోజీ దీక్షితః. |
| 12. | A Sanskrit and English Dictionary (Being an Abridgment of prof. Wilson's Dictionary 1870) | Pandit Ram Jasan |
| 13. | The Practical Sanskrit-English Dictionary | Vaman Shiva Ram Apte, M.A. |
| 14. | The Large Type concise English Dictionary | Charles Annandale M. A., L.L.D. |
| 15. | English-Telugu Dictionary | P. Sankara Narayana, M. A., M. R. A. S. |
| 16. | Telugu-English Dictionary | ,, ,, |
| 17. | Concise Russian-English and English-Russian Dictionary | S. G. Zajmovskij |
| 18. | Hindi-Russkiya Slovare (హిందీ రూసీ శబ్దకోష్) | V. M. Beskrovneya |
| 19. | వైదిక నిలయం | లోకమాన్య బాలగంగాధర తిలక్ |
| 20. | జగత్కథ | కొమాండూరి శఠకోపాచార్యులు (హెచ్. జి. వెల్సుననుసరించి) |
| 21. | మానవ విజయం | ఇలిన్ |

| | | |
|---|---|---|
| 22. | మానవ శాస్త్రం-ఆదిమనివాసులు | ఎం. సోమసుందరం, ఎం. ఏ. |
| 23. | పరిణామ వాదం | చెలసాని వాసుదేవరావు |
| 24. | భారతదేశం | యస్. ఏ. డాంగే |
| 25. | The Aryanisation of India | Nripendra Kumar Dutt, M.A. |
| 2C. | Asura India | Ananta Prasad Banergi Sastri, M. A. D. Phil (oxon) |
| 27. | హిందూదేశ కథా సంగ్రహం | కొమర్రాజు లక్ష్మణరావు, ఎం. ఏ. |
| 28. | ప్రపంచ చరిత్ర | గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ. |
| 29. | ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర | ఏటుకూరి బలరామమూర్తి, బి. ఏ. |
| 30. | ఆంధ్రుల చరిత్ర | చిలుకూరి వీరభద్రరావు |
| 31. | ప్రాచీనాంధ్ర నౌకాజీవన చరిత్ర | భావరాజు వెంకటకృష్ణరావు |
| 32. | ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి | ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ. ఖండవల్లి బాలేందు శేఖరం, ఎం. ఏ. |
| 33. | ఆంధ్రుల సాంఘిక చరిత్ర | సురవరం ప్రతాపరెడ్డి |
| 34. | ఆంధ్రదేశపు చరిత్ర పీఠిక | తేకుమళ్ల రాజగోపాలరావు, బి. ఏ. |
| 35. | ఆంధ్ర విజ్ఞానం 1-7 సంపుటాలు | ప్రసాద భూపాలుడు |
| 36. | కథలూ-గాథలూ | దిగవల్లి వెంకట శివరావు |
| 37. | ఆర్యకవి కుతంత్రం | సూర్యదేవర రాఘవయ్య చౌదరి |
| 38. | తురుష్క ప్రజాస్వామికం | అయ్యదేవర కాళేశ్వరరావు |
| 39. | చీనాదేశ చరిత్ర | — |
| 40. | Brief History of Russia Vol. I | M. N. Pokrovsky |
| 41. | The U. S. S. R. A Geographical Survey | James S. Gregory, B. A., F. R, G. S, D. W. Shave, M Sc. |
| 42. | The Social & State Structure of the U. S. S. R. | V. Karpinsky |
| 43. | Soviet Tajikistan | Pavel Luknitsky |

44. 'సోవియట్ భూమి', 'Peoples china', 'For a Lasting Peace, and For a people's Democracy' Etc.,

45. Year Books, Telugu, Hindi, English, Sanskrit Dictionaries, & Grammars Etc.

# మా లోగడ ప్రచురణలు

1 మార్క్సదర్శి [సంగ్రహ విజ్ఞానసర్వస్వం] కాపీలు లేవు 0—8—0

2 బతుకు పాటలు [విప్లవగేయ కావ్య సంపుటి]
ప్రతులు కొద్దిగా ఉన్నాయి 0—8—0

3 కమ్యూనిస్టులూ-సాహిత్యం [సారస్వత వ్యాససంపుటి] 0—12—0



## త్వరలో

ఆర్యభాషా మూల పదాలు

ద్రావిడ భాషా మూల పదాలు

విప్లవ పాఠాలు [మార్క్సిస్టు విజ్ఞాన సర్వస్వం]

**The Fundamental Principles of Marxism-Leninism**
(A Concise Encyclopeadia of Marxism-Leninism)

పల్లెపదాలూ - స్త్రీల పాటలూ

ఇంగ్లీషు-తెలుగు వ్యాకరణం [సాదృశ్య-వైదృశ్య వ్యాఖ్యాత్మకం]

ప్రజలూ-సాహిత్యం [సారస్వత వ్యాస సంపుటి]

సాహిత్య శాస్త్రం

ప్రతులకు :

అరుణోదయ ప్రచురణాలయం

అమృతలూరు పోస్టు, గుంటూరు జిల్లా